టకోః ॥త॥ మిగుల మోహముస । మగువల నిటువలె । జనపిలో నెవ్వరు జేసి యుండిరా ॥త॥

వ॥ మిత్రమా సర్వధర్మములను దెలిసి యుండికూడ తెలియని వానివలె కరస్త్రీల జల్మిచే బట్టి చెరుప నీకిది మరితగదానా, నీ వే వచింపుము.

మ॥ బలిమి జేసె నిను వలచియుంటినని । పైబడ జూచిన సమయ మునకా ।జ॥ వలదని కోపించియు వెడలించిన । కలికినన్ను యీగతి జేసెనుహా ।బ॥

వ॥ మిత్రమా నాగుణంబు నీవెరుగవా ఆకులుకులాడి నన్నొంటరి పాటున గనుంగొని వలచి యుంటినని నాపైబడవచ్చెను. అ॥ జూచి యెన్నో విధంబుల హితము గరిపితిని. తుదకు కోపగించి వెడలించిన నామాయ లాడి నన్నీగతి జేసియుండెను వింటివా.

కు॥ యిటువలె జేసెన కుటిల రక్కసీ । యెటుదోచదు జేసేమి సేతుహా ।యి॥ జటుబలులామైచను ఫలమేమిక । యెటకైసను యిపుడే గిన మేలగు ॥యి॥

వ॥ ఆహా ఆకుటిల మానసి నిన్నిట్లు జేసెనని నేనెరుంగక నటం టిని నాతప్పు క్షమించుము కాని మన మిందుండ తగదు నెందైన నేగి బ్రతుకవలయును రమ్మా.

మ॥ దిక్కెవ్వరు నాకీకాలంబున । దక్కింతుమునీదరి జేరితికక॥ డి॥ యెక్కడదోచదు నేమిసేయుదును । యిక్కటికులు నన్నెట్టుల విడతురు ॥డి॥

వ॥ మిత్రమా నీకంటె నాకింక దిక్కెవ్వరు యీ తలవరులు నన్నెట్లు విడతురు నీవే యోచించి దెల్పుము.

కు॥ యెందుకు దుఃఖము జెందవు నీమది - యందున కుశదర్పణి నగరీశుని ॥యెం॥ అందంబుగ సేవించిన సౌఖ్యము - జెందెవు భవములు జెందబోవుహా ॥యెం॥

వ॥ నీవిట్లు దుఃఖించిన ఫలములేదు. ఆపత్కాలములందు ధైర్య మవలంబించుటయే శ్రేష్ఠము మనకా శ్రీహరియే గలండు (అని తలవరు లంజూచి) తలవరులారా నాదొక మనవి గలదు వినుడూ.

తుకా—శక—వాదం.

కు॥ విన్నారా కీసుభూవర ! చిన్నిదొరవాక్యములా ! వన్నెలాడి మాటలకూ ! కన్న కుమారుని ద్రుంచనూ ॥వి॥

వ॥ కలవరులారా మన రాజకుమారుని వాక్యములను వింటిరిగదా నిరపరాధియగు వానిని యీదుర్మార్గురాలగు పురోహితుని పుత్రిక మాటలు విని కన్నకుమారుండని తలంపక యిట్టి కఠినశిక్ష విధించుట ప్రభువుకు తగునా మీరే వచింపుడు.

తె॥ అన్యాయమయ్యా యిది - కన్నియ జేయానని - కన్నతండ్రైన గనీ - మన్నన జేయానిదీ ॥అ॥

వ॥ నీవన్నదినిజమేనయ్యా యీయినది చాలఅన్యాయమనే తోచుచున్నది.

కు॥ నేరము లేనివానీ - తీరుగ దండింపనూ - ఘోరపాపంబటంచు - మీరైనను దెలియరా ॥నే॥

వ॥ నిజము కల్ల గుర్తెరుంగక పరుల మాటలు పట్టి కన్న కుమారుని ఖండించుమన్ని మిమ్ముల బంపించుట యిది యెంత అన్యాయమో మీరే యోచించుడు యీరాకుమారునిట్లు వధించుట పాపమో పుణ్యమో మీరే తెల్పుడు.

తె॥ సత్యము యీమాట యితని - మృత్యువు తప్పించుటకూ - యత్నము జేయూటకూ - నేమిదోచదు మాకు ॥స॥

వ॥ అవునయ్యా యిది సత్యమేకాని యితని ఖండించక పోయిన రాజేంద్రుడు మమ్మేమనకపోడా మాకెటు దోచకున్నది దీనికేదైనా యుపాయంబు నీవే దెల్పుము.

కు॥ భూపతితో మీసుతునీ - రూపు మాపినామనీ - యీపగిదిన దెల్పుడీ - మాపైకృప నుంచుడీ ॥భూ॥

వ॥ మీరా రాజేంద్రునితో మీకుమారుని వధించి వచ్చినామని తెల్పుడు మేమెందైన నేగి బ్రతుకగలము మీకు చాల పుణ్యమగును. మీ యుపకారమును మేము మరువము. యిదో మీకీ చంద్రహారమును బహుమతిగా నిచ్చుచున్నాను గైకొనుడు.

తె॥ మంచిది కుశదర్పణీ - మాధవుడే గతిడికా - దుఃఖము వెళ్ళుండికా - చంచలంబు నొందకా ॥మం॥

మేమూ రాజుగారితో యేదైన యుపాయము వచించి తెల్పెదము, యిక మేము పోవుచున్నారము. (నిష్క్రమింతురు)

కు-వ॥ మదన విజయా రమ్మా సారె యెటువినుము.

మ-వ॥ మిత్రమా శోభనసమాచారమేమో తెల్పుము.

కుశా—మద—వాదం—దర్వు.

కు॥ రారమ్మి సోదామితా - రాజకుమార ॥రా॥ రారమ్మి మన మూ యీ - రాజ్యంబు విడచీతిమి - ఘోరాటవులలోన కోరి చరి యించవలయు ॥రా॥

వ॥ రాజేంద్రతనయా మనిమిందుండ తగదు యెందులకైన నేగి బ్రిదుకవలయును రమ్మి.

మ॥ ఘోరావనంబూలునూ - మిత్రామ మనము - జేరీతిమీ యింకనూ ॥మి॥ భూరీ సింహావ్యాఘ్రమూలూయీవనమునందు - కేరూ చునున్నవదుగో నేరూప్రు తోడూత ॥

వ॥ కుశాగ్రబుద్ధీ అదో చూచితివా యీ యరణ్యంబున గొప్ప గొప్ప మృగంబులు సంచరించుచు చెవులు బ్రద్దలగునట్లుగర్జింపుచున్నవి.

కు॥ గండభేరుండంబులూ- నివసించూనట్టె - దండీవనంబూలనూ॥ కొండ గుహాలాను జూడ గుండెలవియాగజొచ్చె - యెండనీడనకుండ నేగవలసెను నేడు ॥గం॥

వ॥ జౌనౌను మృగంబులేగాక గండభేరుండంబులుగూడ నిచ్చట చరించుచున్నవి యిట్టి ఘోరారణ్యంబులో దిరుగుటకు బ్రహ్మదేవుడు మన నొదుట వ్రాసెనేమో కదా.

మ॥ పురమూలు విడచీతిమీ - యతి ఘోరమైన - యడవ్రూలు దాటీతిమీ ॥య॥ పురవాసులకునూ యేర్పడకుండ నిప్పూడు - పరదేశ ములకూను - యరుదెంచినారమింక ॥పు॥

వ॥ సుబుద్ధీ మనదేశమును విడచి యిప్పటికి పరదేశములో నడు గిడితిమి యిక మన గండము కడతేరెనుగదా.

కు॥ అనుభవమును దప్పదూ - తనువున్నూ మెన్ని - దినమూలకైన నిప్పూడూ ॥త॥ వినుమింక మనమెన్ని - దినమూలు పరరాజ్య - మున నూ నివసించూచు దినమూలు గడూపవలెనో ॥అ॥

వ॥ మిత్రమా యెంతటివారికైన పూర్వజన్మ కర్మంబు దప్పదు

మ॥ వాసవ వంద్యరావా - కుశదర్పణకరీ - వాసమమ్మేలుకోవా ॥కు॥ యీ పనులు నీవు దాసాలమైన మమ్ము - జేపటజెట్టరా శిరి జేశా పొం[illegible] ద స్థిత ॥వా॥

వ॥ హే పరమేశ్వరా మమ్మేల రక్షింప నీదే భారముకదా స్వామీ.

కం॥ వచ్చితిమి యింద్ర పురమునకు ♦ యిచ్చటను శివాలయంబు నింపుతో నుండెన్ ♦ యచ్చపు భక్తితో భవుడును ♦ మెచ్చునటుల పూజజేయ మేలగు మనకున్ ॥

వ॥ మిత్రమా మనమిదే యింద్రపురంబునకు వచ్చితిమి అదో ఆశివాలయంబునకేగి శివుని దర్శించిన మనకు మేలగును కద.

కు-వ॥ సరే అటులే పోవుదము పదుడు. ( అని శివాలయమున ప్రవేశింతురు. అంత నక్కడ రెండు చిత్రపటము లుండుటంజూచి )

మద—దర్వు—ఆది.

ఆహా యీ పటమునందుగల - వనితలెంత యందముగలరూ భళీ॥ ఆ॥ యూహించి చూడ వీరితోసరి - యెందు రెందునైనగాని ధాత్రిని । హాహా వీరినిందుదెచ్చి చూపెటి - ఆప్తులెవరు నాశాప్తులెవరు ॥ఆ॥ వీర లను లిఖయించినట్టి - వారలెంత బుద్ధిశాలురో కద ॥వీ॥ శూరుడైన శిల్పి చారి వీరల - జూచియుండవచ్చు నెందునైనను - వారలుండునట్టి జాడ దెల్పెటి - వారలెవరు ధీరులెవరు ॥ఆ॥ బంగారపుకురులనుగల - యింగ నలనుగని పొంగెను నామది ॥బం॥ మగూవలాయొక నగూమోముగని- మిగూల మోహామునిగన్ జెందితిని - మగూవను నాకొసంగునట్టి - మాన్యులెవరు ధన్యులెవరు ॥ఆ॥ వాసా కుశదర్పణేశ - యీసమయము నను బ్రోవుముశ్రీశా ॥వా॥ వాసిగనేను యీవనితలగనియును - భాసి ల్లితినేనీ సమయంబున - దాసపోష నాదుశోర్కు దీర్పెటి - ధన్యు లెవరు పుణ్యులెవరు ॥ఆ॥

వ॥ హా శ్రీహరి జగద్రక్షకా నీకరుణలేక యీ కన్యకా మణులు నాకగుదురెట్లు దేవా మహానుభావా (అని మూర్ఛిల్లును)

కుశా—దర్వు.

ఏమిసేతూ - యేమిసేతూ - యీ మహాత్ముడీ మహిపై మూర్ఛి ల్లెను ॥ఏ॥ యీమహా పటమును గాంచియు భామలపై మోహ మొంది-

యిట్టి రూపోషులుగల్గా । యిట్టికన్య లెందున్నరో తెలియదు హా ॥ఘు॥
యెట్టిపోసంగినను నాకు । నేనెవనమున ... గట్టి నిప్పు
డితడూ మన్నా । సతుపైద్ధర నొరగను హా ॥ఘు॥ సానుదేవ..కుజదర్పక
వాస మన్మో లీ సమయంబున బోవ్రుమా ॥హా॥ పాపము... కన్నియుల
పటములు । జూచి మోహపోటుపు హా । యీశ.. మున్మా...నేలుమా
జగదీశ మహేశ పరాత్పర ॥ప॥

కం॥ పటమును గని మదన విజయుడు ♦ యిటు మూర్ఛను జెందె గాన నెటులోపదునో ♦ యెటనుందురో యీకన్యలు ♦ తటుకున నాతో వచించు ధన్యులెవరికన్ ॥

వ॥ విజయా లెమ్మా. యీ చిత్రపటమునుగాంచి మూర్ఛిల్లుట తగునా! యేల యీ పిచ్చితనము (అని లేపి కూర్చుండబెట్టును)

ముఖ - కుశా - వాదం - దర్పు.

మ॥ నా । మనవి వినూ । మనవి వినూ । మదిని గనూ ॥నా॥ యేమందును యీ పటమునందు గల । భామలెందు నుందురో తెలియదుహా ॥నా॥

వ॥ సుబుద్ధీ యీపటమునందుపడి కాంతామణులెందు నుందురో కదా వారి జాడలం దెల్పువా రెవరు గానరారెరిగదా.

మ॥ యేలా । గోలుటికా । గోలుటికా । చాలునికా ॥యే॥ బాలలెందు నున్న వెదకితెచ్చెద । యేలచింత భూపాలతనయువిను ॥యే॥

వ॥ రాకుమారా ఆకన్య లెందుండిను వెదకి తెచ్చెదను గాని నీమది దాపంతంబు నొందకుము.

మ॥ దాపు । నీవేయిక । నీవేయికా । బ్రోవుమికా ॥దా॥ ఆపదాలు దొలగజేసి నన్నును । కాపాడునట్టి ఘనుడవీవె కదా ॥దా॥

వ॥ నాకు యాపదలు వచ్చునపుడెల్ల నీవే నన్ను కాపాడుచుంటివిగదా. నీకంటె నాకాప్తులింకెవ్వరు! మిత్రమా నన్నురక్షించుము.

కు॥ యేనూ । యేగెదనూ । యేగెదనూ । యేగెదనూ వేగమునూ ॥యే॥ యిగను నేను వచ్చునంతవరకును । దిగులు జెందకోక నుండవలయును ॥యే॥

వ॥ నేనిప్పుడే పోయి యీ కన్యా రత్నంబులం దెచ్చెదను కాని నే వచ్చునందాక నీవిచ్చోటనే జాగ్రతగా నుండవలయును వింటివా.

మ॥ తామ । తెలుపువిధీ । తెలుపు విధి । పలుకు విధీ ॥తా॥

తాలియుండఁగాని పోమ్ము వేగమె । చాలనాదుమందుప్రేమ లుంచియు

వ॥ ఓతల్లిమా నీవు వచించినట్టులె నే నిచ్చోటనే యుండెదను. నీవతివేగంబున బోయిరమ్ము. నమ్ము మరువకుము.

ఛ॥ నీ । మనమునఁ గనూ । మనమునను । క్షమను॥ సూ ॥నీ॥ ధ్యానించుము మకరదర్పణి వానుని । మానవలదు సుమ్మి ! మదిలో నెప్పుడు ।నీ।

వ॥ విజయా నీ మనంబునం గల చింతలెల్ల వీడి ధైర్యంబుతో నుండుము నేనిప్పుడేపోయి యా కన్యలం దెచ్చి నీకొసంగెదను.

మ॥ వ। సరే అటులే పోయిరమ్ము.

కు। వ॥ (తనలో) యాకన్యలుండుచోటు నాకెట్లు దెలియును. వృధా యాలోచించిన ప్రయోజనంబు లేదు. యీ దేవాలయ ధర్మ కర్తను విచారించిన యా కన్యల వృత్తాంతంబు దెల్పగలడేమో చూచెదగాక. (ధర్మకర్తతో) మహాత్మా యీ దేవాలయంబున తూర్పుభాగంబున లిఖించిన చిత్రపటము లెవరిచే లిఖించబడెను. వారెచట నుందురో తా మెరిగియుండిన దెల్పుడు.

ధ-వ। వత్సా యాపటముల లిఖించిన యతడు యిచటికి పంద్రెండు యోజనముల దూరంబున దేవకీపుర ముండుండును. యతడు గొప్ప శిల్పాచారి వింటివా.

కు-వ॥ యా పటమందలి కన్యలను తా మెప్పుడైన చూచియుంటిరా?

ధ-వ। చూడలేము, యా వృత్తాంతమంత నతనివద్ద కేగిన తెలుప గలడు. నాకేమియు దెలియదు.

కు-వ। సరే మంచిది. సెలవొసంగుడు పోయివచ్చెదను.

ధ-వ। అటులే పోయిరమ్ము.

కు-వ। (తనలో) నేనిచ్చట వృధా నాలస్యంబు చేయక యా శ్రీహరిని భజించుచు దేవకీ పురంబునకు బోయెదను.

కు - దరువు

।శ్రీపార్వతీశా । శ్రితజనపోష ।శ్రీ। దాపునీవంటి । కాపాడుమంటి। ।శ్రీ। దేవకీపురమూనకూ । త్రోవజూపుము నీకు । సేవకుడను గానా । యీవసుధలోన ।శ్రీ। మకరదర్పణిలో । మకురుగా నిలచినా ॥కు॥ పశుపతీ

వ॥ దేవా నేనీ దేవకీపురంబునకు జేరవచ్చితిని గాని యీ శిల్పా చారి యెందు గలడో తెలియనైతిని. యీ నగరవాసుల నడిగి తెలిసి కొనెదగాక.

శిల్పాచారి ప్రవేశం - దరువు - ఆది.

ధీరుడ నిధి గంభీరుడనూ । మహా । శూరుడ శిల్పా చార్యు డనూ । ధారుణిలో పల పేరు వహించిన । శూరుడ శిల్పాచార్యుడనూ ధీ॥ సుందరమైన పటంబులనూ నే । నందంబుగ లిఖియించెదనూ । ఎంద రెందరో చూడగ నేత్రి । నందంబును గలిగించెదనూ ।ధీ॥ చిగురు టాకువలె నగు మొగమునుగల । చిత్రపటములను వ్రాసెదనూ । వగలు గుల్క జిగిబిగి తేజంబుల । వనితల గని లిఖియించెదనూ ।ధీ। భూమి యందు కుశదర్పణివాసుని । నామమునూ యేమారకను । నా మానస మున దలచుచు నుండెద । ధీమంతుడ నే నీ మహిని ।ధీ।

కు-వ॥ (తనలో) నే నీ మహాత్ముని విచారించెదగాక. (ప్రకా శము) అయ్యా నా ద్రాక్ష మనవిగలను చిత్తగించుడు.

శి-వ॥ అదెట్టి మనవియో తెల్పుము.

కుశా - శిల్పా - వాదం - దరువు.

కు॥ యెవరయ్యా మీరూ । యెందుండువారూ ।యె॥ వివరించెర యావిందును వీనులలరా । సవినయమూనా । సంగూన నాతోను॥

వ॥ మహాత్మా మీరెవరు మీ సవిస్తారంబెట్టిదో వినంజేయుడు.

శి॥ ఓమహాత్మ యేనూ । యీమహినానూ ।ఓ। భూమిజాతులకు మెప్పైన । లేమలను లిఖియింతు నా । నామంబు శిల్పచారీ యని యందురూ ।ఓ॥

వ॥ యేను మహామతి యను శిల్పకారుడను. నానామంబు శిల్పా చారి యందురు. మీరెవరో వివరించుడు.

కు॥ నీకుకొరకనూ యేనూ । నిందారుదెంచిననూ ।నీ। నాను కోరిక చేకూరెనయ్యా యీనాటికీ । వో దయాబ్ధి చంద్రి । ఆదరించావె నన్ను ।నీ।

వ॥ అయ్యా నీకొరకే నేనింతదవ్వు విచ్చేసితిని. నామనవి యాల కించి నన్ను కృతార్థుని జేయుమని వేడుచుంటిని వింటివా.

శి॥ యిటులేల బల్కెదారూ ! నిటు వచించారే మీరూ ।యి। వటు బలులై యుండీయూ । యిటనన్ను వేడూటయూ । యెటు వో

చదయా । యేనుందునయా ।౦౩౹

వ॥ ఇది యేమహాస్వర్గము. మహా శూరాగ్రేసరులై మీరుండి నన్ను వేడు ముంచు ట్లి ౼ రణమేనిలా తెల్పుము.

కు॥ యింద్రాపురంబాసందూ । యందు దేవాలయమందు ।౩౦।
నుందాలి మణులాను । నంచు లిఖించినారూ । యెందుంతువారూ యెరి
గించరయ్య మీరూ ।౩౧॥

వ॥ యింద్రపురంబున నుండబడిన దేవాలయములోని చిత్రపటము లను తామే లిఖించినారని వినియుంటిని. యీ కర్తలెవరో యెచట నుందురో వారి నామములేవో నాతో దెలుపుడు.

శి॥ వర కుళదర్పణి - పరమాత్మ కరుణతోనీ -వ- కురులను జూచి నే - కరముతో వ్రాసితి - మరియు నే జూడా లేదూ- మగువాలను యికను వ॥

వ॥ నా స్నేహితుడొకడు యీ స్త్రీల రెండు వెంట్రుకలు దెచ్చి నాకిచ్చెను. వాటిని జూచి నా చాతుర్యంబున యీ పటములను వ్రాసి తినిగాని యీ స్త్రీలను నేనుమాత్రము జూడలేదు వింటివా.

తు - శిల్పా - వాదం - ఆది.

కు॥ మానవజాతికి యెందైనను యిక । మరి బంగారు కురులు గలవా । క్షోణియందు యెవ్వరైన కన్నుల । జూచియుండి యున్నర తెలుపూ ।మూ॥

వ॥ మానవజాతికి జన్మించినవారలకు బంగారు వెంట్రుకలు గల వని యెవ్వరుకూడ నింతవరకు వచింప వినలేదు. ఒకవేళ మీరు చూచి యుండిన తెల్పుడు.

శి॥ వారివద్ద నాదు మిత్రుడైన । వీరభటుడు కొలువున్నదటా వారి కురులు దెచ్చియు నాకొసగిన । వ్రాసియుంటి నా నేర్పుగనా॥

వ॥ నా మిత్రుడొకడు వీరభటుండనువాడు గలడు. అతడే వెంట్రు కలు గొనివచ్చి నాకొసంగిన వాటి యాధారంబున యీ పటములను లిఖించితిని వింటివా.

కు॥ నీదు మిత్రుడైన వీరభటునీ । నెలవు యేపురంబున గలదూ నాదుయందు ప్రేమలుంచి మీరలు । వాదనకను దెల్పగవలయూ ।వీ॥

వ॥ యీ వీరభటుడేపురంబు ననుండునో నాయందు కరుణవహించి తెల్పుడు మహాత్మా.

శ॥ భీమపురంబనె నగరంబుననూ । తామును నివశించును విను మూ - భామినీమణులు నెందరుగలరో తె । నేమాత్రము దెలియకగలేను॥

వ॥ ఇచ్చోటికి సంబ్రాందాముదల దూరంబున భీమపురంబనే నగరంబు గలదు. ఆ నగరంబుననే కాపురముండును. నీ వచ్చటికేగిన సర్వము తేటపడును.

కు॥ ఆలు పిల్లలూ యతనికి గలరా । నాలకింతు దెల్పగవలయూ చాలవారి మర్మమెల్ల మీకును । మేలుగాను దెలిసియుండవచ్చును ।ఆ।

వ॥ అతనికి భార్యపిల్లలు గలరా? యాతని చరిత్రంబెల్ల మీకు దెలిసియుండవచ్చును. వారి నామధేయాదులం గూడ దెలిసి పుణ్యము గట్టుకొనుడు.

శ॥ భార్యపేరు లక్ష్మమ్మ యుండురూ । బాలలిద్దరూ గలరూ । చాలదినంబులు జరిగెను వారి । పాలికి బోకను పనులు గల్గుటచె ।భా।

వ॥ అతని భార్యపేరు లక్ష్మమ్మ. వారి కొక పుత్రుడును యొక పుత్రికయు నుండిరి. ఆ లక్ష్మమ్మ పుట్టింటివారు తూర్పుదేశంలో నుండిరట. ఆ లక్ష్మమ్మకొక అన్న మాత్రమే గలడట. వారింటికి వీరు వీరింటికి వారు యింతవరకు రాకడ పోకడలు లేవట. నేనుకూడ వారింటికేగక చాలదినంబులైనది. యిదియే వారి వర్తమానము.

కు॥ పోయినిప్పుడె సెలవొసంగుడండీను । నాదు మిత్రుని జెదకి చూచు । యీది మరువలేక మిమ్మెప్పుడు । నాదు మానసంబున నెంతూ ।పో।

వ॥ తాము నాపై దయదలంచి సెలవొసంగుడు పోయివచ్చెదను

శ॥ పొమ్మిక కుశదర్భశేవాసుని పొడి - నమ్మి నామది నమ్మకి మాయెను - యిమ్మహిలో కీర్తిగాంచి నీవు జయమొందెదవు నాయక్క మత మియ్యదె ।పొ।

వ॥ భళే అటులే పోయిరమ్ము. నీకు శుభంబగుగాక.

కు-వ॥ (తనలో) ఓహో నేనీ శిల్పిచే యీ కన్యల వృత్తాంతము దెలిసికొంటిని. కాని యీ భీమపురంబు నెంతయో దవ్వుండెను. నా మానసంబున నుమాకాంతుని గీర్తించుచు బోయెదగాక.

కు - దర్వు - ఏక.

శంకర యిటురారా । నా । వంకదీర్పవేరా । శం । నంకట

పీ॥ రాం రామోయ్ బావగారు । రమ్మి మన గృహమూనకూ। క్షేమమా మావారలంపకు । బావ మాకు వచించుకుడీ ॥రాం॥

వ॥ ఓయి బావోజీ మావారలంత క్షేమంగ యున్నవారలే కదా కొన్నాళ్ళకు విచ్చేసితివి మాభాగ్యమేమనవచ్చును.

క॥ తాకుమ మావారలిలలో । క్షేమమేనా తెలుపుమా । నా మదీ సంతోషమాయెను । తాము నగుకడుతోడనే ॥తా॥

వ॥ బావోజీ నీ వగుకడినతోడనే నామనస్సు కెంతో సంతోషం బాయెను, కాని మీరంత క్షేమమేనా తెల్పుము.

పీ॥ ధారుణీ కుశదర్ప నగరీ । ధాముని కృప చేతనూ । మీరు బలుకూ విధము మేము । క్షేమముగ నున్నారమీ ॥ధా॥

వ॥ మీ కరుణచేత నింతవట్టుకు క్షేమంగనే యున్నాము కాని మన గృహంబునకు బోవుదము రమ్మి.

క-వ॥ సరే అటులే పోవుదము పదమ్మి.

వీర - అమ్మి - కుశా - వాదం - దర్ప.

పీ॥ విన్నావె పిల్లా మీయన్నా వచ్చినాడు । నిన్ను జూడ గోరియూ ॥ ఆహా॥ ని॥ మన్ననచేతాను మాపైని కృపగల్గి । యిన్నాళ్ళ కిటు వచ్చెనూ । ఆహా ॥ యి ॥

వ॥ వోపిల్లా యిదో మీఅన్న వచ్చిండు. మన గృహంబు గానక వీధిలో తిరుగుతుంటె తోలుకొచ్చిన చూడు.

ల॥ అన్నా వోయన్నా ని । న్నెన్నో దినంబులాకు కన్నూల జూడనైతి । అహా॥క॥ పిన్ననాటనుండి నన్ను మరచియు । యున్న రైతి రేలనూ । ఆహా ॥యు॥

వ॥ అన్నయ్యా నిన్ను చాలాదినాలకు చూడగలిగెగదా.

కు॥ పేదరికమూ చేత ॥ యాదీ మరచీ యుంటి ॥ నీ దయనే సోదరీ ॥ ఆహా । నీ । నాదుతప్పూలెల్ల నీదు మనంబూన । యాదీ మరువూ మింకనూ ।ఆహా॥ ।యూ।

వ॥ సోదరీ బీదలమై యున్నందున రాకడ కాలేదు. నా తప్పులెల్ల క్షమించుము.

ల॥ చింతేమిలేదు నేడింతలో నామది । సంతోషమాయె నన్నా ఆహా । సం । యింతాలో మీరు నాచెంత కేతెంచిన । చింతాలు

వ॥ అన్నా నీవిచ్చోటికి వచ్చినతోడనే నామనంబు సంతోషం బాయెను కాని మీన వారంత క్షేమమేనా తెల్పుము.

కు॥ చెల్లెబావా చీరె శెల్లాలు దెచ్చిన ; చేకొండి మీరింకనూ । హాహా ॥ చే ॥ పుల్లామందూ కుటీల ముంచాక మాపై మా । తల్లిరో దీవించ । ఆహా ॥ త ॥

వ॥ సోదరీ నీకు చీరెరవికే బావకు పాగశెల్లా కట్నాలు దెచ్చిన తీసుకొని దీవించరే యీ దీనున్ని.

ల॥ మాయందు సింతిమె మీకరుణనుంబె చాలు । యాదీసుర తుమేవిధీ । । ఆహా ॥ యా ॥ వోయన్న యెంతదవ్వుండీ నీ వొ స్త్రీవో । చేయుండి సాపాటునూ ॥ ఆహా ॥ చే ॥

వ॥ అన్నయ్యా పొద్దుబోయినది సాపాటు లెమ్ము జేయుము.

కు॥ యిలలో కుశద్రేణి । నిలయూని కరుణాయు । వలనా మిమ్ములగంటినీ । ఆహా ॥వ॥ సెలవొంద మీపాద సేవాకుడనుసుమ్మి । వలనొప్ప దీవించుడీ । ఆహా॥ వ॥

వ॥ సోదరీ శ్రీహాకృప వలన మిమ్ముల గనుగొంటిని నాభాగ్యం బేమన వచ్చును. వీర - కుశా - వాదం - దర్వు.

వీ॥ బావా నేరాజుగారీ । భవనముకు బోయెద ॥ భ ॥ నేవ చ్చూసంతవరకు । నిటనుండూ మనియెదా ॥ని॥

వ॥ బావగారూ నే రాజుగారి భవనంబునకు పోయివచ్చెద నే వచ్చునందాక నింటిలో నుండుమిరాజపుత్రికలకు పూలహారంబు లిచ్చి వేగిరమే వత్తును.

కు॥ వత్తూ మీవెంటనేనూ । వనితలనూ జూడనూ ॥వ॥ యిత్తూ రసెలవూ నా । కిపుడూను వేగనూ॥ యి ॥

వ॥ ఓయి మీరాజ పుత్రికలను జూడ వలయునని నాకోనిక గలదు చూపించెదవా.

వీ॥ రారాజులసైనగాని । రానివ్వ రచటికీ ॥రా॥ మీరు విచ్చే యుటకూ । మేలేమి లేదటూ ॥రా॥

వ॥ అచటికెవ్వరిని రానివ్వరుగదా నీ వెట్లువత్తువు వచ్చుటచే రాజగారివల్ల శిక్షకు పాత్రుడవౌదువు.

కు॥ బావా నీమర్మమెల్ల । బాగుగ గనుగొంటినీ ॥బా॥ యివే

వ॥ సరే నీ పేరులెల్ల నాకుందెలిసెను. నేనిక్కడెందుకుండవలెను మాయింటికి వెళ్ళిపోదును.

పి॥ యింతా కోపంబదేల యిపుడే రారమ్మికా ॥యి॥ చింతేలా వాకన్యల చెంతకు గొనిపోదురా ॥యి॥

వ॥ బావా యెంతమాటాడితివి రారమ్మ పోదాము ఇట్లు నీ వలిగిపోయిన బాగుండునా.

కు॥ వచ్చిమ్మా కుశోదర్పణీశు పాలించుమా మనలనూ ॥వ॥ నమ్మాత మాయెమదికి సరిగూన నేడునూ ॥వ॥

వ॥ వాబా యిప్పుడు నామదికి సంతోషంబాయెను అటులే పోవు దము పద.

పి. వ॥ వాబా నీవచట నేమియు మాట్లాడవలదు వింటివా.

కు-వ॥ నీవనుట్లుగానే వర్తించెదను నమ్ముము. (నిష్క్రమించు)

చంపకగంధి పుష్పగంధి ప్రవేశం — దర్వు.

భూమిశుద్దైన యీ భీమరాజునకు - ప్రేమా పుత్రికలం - ప్రే మాపుత్రికలం - సోమా వదనులం ॥భూ॥ చంపాక గంధీ పుష్పగంధియని యందూరే మమ్మా - యందూరెమమ్మా - యిందూనుమమ్మా - చెలి ॥భూ॥ బంగారు కురులుగల యంగానులనిమ- మ్మా దూరోయమ్మా అందూరోయమ్మా - ముద మొందీ వోకొమ్మా - చెలి ॥భూ॥ మందా గమనులము సుందారాంగులము - యిందూ ముఖులమూ - యిందూ ముఖులమూ - మాయిందాము గనుమూ - చెలి ॥భూ॥ ధరాణి కుశ దర్పణీ మందిరా - ధామూడేలునే - ధామూడేలునే - శ్రీరామూ డేలునే - చెలి॥ భూ॥

చం॥ సోదరీ పుష్పగంధీ నాదొక మనవి గలదు.

పు॥ భగినీ చంపకగంధీ అదెట్టిదో విన్నవించుము.

చం—పు—వాదం—దర్వు—ఏక.

చం॥ మనవివాహము జేయడాయే - మనజనకుడు సోదరీ ॥ మ ॥ కనికరంబు లేదుయెంతో - కఠినుడుగద సోదరీ ॥మ॥

వ॥ సోదరీ పుష్పగంధీ మనజనకుడెంత నిర్దయుడు మనకింతవరకు వివాహము జేయడాయెనుగదా.

పు॥ అడుగవచ్చిన వారినెల్లా - హతమును గావించెనూ ॥అ॥

పుడమిలోనిటు లెవ్వరైన - వశపరగానూ బాడనూ ॥అ॥

వ॥ భగినీమణి మనమి సమానమైన వారినెల్ల జరిమాధ్యము చెందెను. యిట్టి విపరీతంబెందైన గలదా.

చం॥ మదన తాపము చేతనాదు - మదియునిల్వదె సోదరీ ॥మ॥ కుదురును మనకెన్నటికీ - కోరికలును సోదరీ ॥మ॥

వ॥ విరహ తాపంబున నామనస్సు నిలువకున్నది మన జనకుండు మన వివాహంబుల జేయుటెన్నడో కదా.

పు॥ సుందరులమై యున్న నేమి - సుఖమే భగినీమణీ॥సుం॥ పొందుకూ వరుడూను లేని దెందుకే భగినీమణీ ॥సుం॥

వ॥ మనమెంత సుందరులమైన నేమి ఫలము మనకు తగినవరుడు లేక జన్మము వృధా జేయవలసి వచ్చెనుగదా.

చం॥ యెంత వైభవంబుండిన - నేమి ఫలమె సోదరీ ॥ యెం ॥ కాంతుడు లేనట్టి వనితల - కెంతో హీనము సోదరీ ॥యెం॥

వ॥ యెంత సౌందర్యమున్నగాని యెన్ని భూషణము లుండినగాని పతి భూషణము సమముకాదు వింటివా.

పు॥ ధారుణి కుశదర్ప నగరి - ధాముకృప భగినీమణీ ॥ధా॥ యే రీతిగ గలదో మనము - యెరుగమె భగినీమణీ ॥ధా॥

వ॥ ఇదియంతయు నిజమేకాని యా పరమాత్మునికృప మనయందెట్లున్నదో యెరుగ జాలము గదా.

చం—వీర—వాదం—దర్వు.

చం॥ సేవకి నేడింత తడవు - చేసిన కారణమేమి ॥సే॥ నీవును వచియించవేరా - నిజముగ మాతోను యిపుడు ॥సే॥

వ॥ సేవకా నీవు నేడింత ఆలస్యంబై వచ్చుటకు కారణమేమో మాతో నిజముగా వక్కాణించుము.

వీ॥ తడవైన మాట నిజమే - తప్పులు క్షమియించరమ్మ ॥త॥ నెడమీదయ గలిగిన - స్నేహనగవలదు సుమ్మా ॥త॥

వ॥ అమ్మా మాయింటిలో కొంతపని యుండుటచే ఆలస్యం బాయెను క్షమించండి.

చం॥ వీరెవరోరి మాతో - విన్నవించ వేర నిపుడు ॥వీ॥ఓరి మా తండ్రివిన్న జీరివేయు గలడుసుమ్మి ॥వీ॥

వ॥ ఓరే అదంత సరేగాని నీవెంట వచ్చిన యీతండెవడు

మూతిండిప్రివిన్న బ్రతుకగలడా తెల్పుము.

మి॥ నామభార్య్ని పోషయించు - నాతో నిటువచ్చినాడు ॥నా॥ ఏనాదు సేవకులము మేము - నీనాదయచే పోతుమిలాము ॥నా॥

వ॥ అమ్మా యితడు నాభార్యకు అన్నగావలెను నేడే వచ్చి యుండెను వారి క్షేమములు విచారించుకొంటు పొరపాటున నెందరు దెంచితివి క్షమించుము. ఇదో పూలమాలికల గొని మాకు సెలవొసంగిన పోవుదుము.

చ॥ మంచిది మీరిపేటినుండి మహావేగంబునను బొండు ॥మం॥ ద్రుంచగలడు నాదుతండ్రి - యెంచిచూడు మితని నేడు ॥మం॥

వ॥ సరే మీరిక వెంటనే యిచ్చటినుండి వెడలిపొండు తడవొనరించిన మాజనకుండు జూచి నీయువతుని దుప్రించక మానడు. యీతడు మిగుల సౌందర్యముచే మెప్పియున్నాడుగదా పొండు.

వీ॥ వాసిగ కుశదర్పనకరి - యీశుడేలు నీసమీపము ॥వా॥ మోసమెచ్చు మీదుసేవ - జేసియు నేబోయెదా ॥వా॥

వ॥ ఔను మీదగు విధంబుననే పోవువారము. (నిష్క్రమించు)

లక్ష్మి—కుశా—వీర—వాదం—దర్పు.

కు॥ సోదరీ - సోదరీ - నీదయ నాయందునుంచు - పోదునుమద్గృహమునకు ॥సో॥ యీది మరువ వలదుసుమ్మి - నాదువాక్యమును నమ్మి - నీదు భర్తతో మిగుల - నీతితో కూడుండవలయు ॥సో॥

వ॥ సోదరీ నేనిటకు వచ్చి చాలా దినంబులయ్యెను యిక సెలవొసంగిన పోయి వచ్చెదను.

ల॥ అన్నరో - అన్నరో - యెన్నడు నినుజూడగలనో నన్ను మరచి యుండబోకు ॥మ॥ యిన్నాండ్లవలెను నన్ను యికమరచీ యుండకంటి - కన్నవారు మీరలిటుల కఠినంబు దలచవలదు ॥అ॥

వ॥ అన్నా నీవిన్నాళ్ళకు వచ్చి అప్పుడే పోయెదనను చుంటివి మళ్ళి యెన్నాళ్ళకు నిన్ను జూతునోకదా.

కు॥ నీమదీ - నీమదీ - నీమది చింతేలవలదు - నేమరచీ యుండబోను ॥నీ॥ నీమనో హరునియాజ్ఞలోనివునువర్తించుచుమాకు - పేర్మితో కూడుండిమాకు పేరుదెమ్ము మికను తల్లి ॥నీ॥

వ॥ నీవిట్లు చింతించక నీభర్తాజ్ఞలో మెలంగుచు మాకు పేరు దెమ్ము. నే మళ్ళివచ్చి నిన్ను దోడుకొని పోయెదను వింటివా.

ల॥ అడిగినా - దడిగినా - పడిగినదని దెలుపుమా - వదినెగారి తో మరదలు [illegible] నిను కనుట జాతునెపుడో యని - నుడివెదు యీ విధమని మావదినె గారితో దెల్పుము ॥అ॥

వ॥ అన్నా మావదినెగార్కి చాలచాల అడిగినానని తెల్పుము.

కు-వ॥ సరి అటులే దెల్పెదను బావా పోయికమనవి.

కు॥ నీదయా - నీదయా - నీదయనోయి బావగారు పోదునికను మాయూరికి ॥నీ॥ నాదు సహోదరి మీదను నీదుకృపను యుంచవల యు - దోడిపరువబోను నిన్ను - నాదువాక్యములునమ్ము ॥నీ॥

వ॥ బావా నేవచ్చి చాల దినంబులాయెను యిక నేబోయివచ్చె దను సెలవొసంగుము. మా చెల్లెలిని చక్కగా పోషించుము.

పీ॥ యేలునూ - యేలునూ - యేలును కుశదర్పనగరి ఫాలలోచ నుండు మనల ॥నే॥ యేలను నీమదినిచింత - జాలించుమి పాలింతును - చాలప్రేమ నింతవరకు నవరించిన దెరుగలేవ ॥యే॥

వ॥ బావా యెంతమాటాడితివి మీచెల్లెలి నెట్లుప్రేమించుచున్నది నీవెరుగవా. నీమదిలో దావంతంబుంచక పోయిరమ్ము.

కు॥ (తనలో) హా దైవమా యిక నేనేమిసేయుదను యీకన్యలు నాకెట్లు జిక్కెదరు.

కుశా—దర్ప—ఆట.

ఎటుదోచదాయెనే - నేమిసేయుదునుహా - కటకట నిదియు సంకటమూ ప్రాప్తించే ॥ఎ॥ వనితాల కొరకు నేవచ్చితి నిందాక - కను గొంటి గానీ నే గొనిపోవు దెటులా -ఎ- కన్యాల నడిగిన కన్నీయలను గన్న - కన్నతండ్రివార్కి ఖండించునటహా - ఎ- మళ్ళిపోయి నేను మదన విజయునితోను - యీలాగు దెలిపీన నిలనేమి ఫలమూ -ఎ- అటుగాక నూ నేను - యిటమరణించిన మేలు - కటుబలుడు వచ్చోనని ప్రాణంబు నిలుపూ -ఎ- మరణించుటచెనాకు మరిపుణ్యఫలమబ్బు - ధరయందు జీవించి దక్కవిజయుడూ -ఎ- వరకుశదర్పణి మురహరి కరుణయు - యేరీతి గలదో నే నెరుగజాలనుహా ॥ఎ॥

వ॥ ఆహా నేనిట్లు వృధా చింతించిన లాభములేదు పూరకే వెళ్ళి పోయిన మదనవిజయుండు మోహాతి రేకంబున మృతినొందును. నాకా పాపంబు ఘటించును. కావున నేనీ సముద్రంబునం బడి మృతినొందిన మేలుగదా (అని సముద్రంబున బడబోవును అంతలో)

శంకరుడు పార్వతీ ప్రవేశం—దర్వు.

సాంబశివుడరా - శంభోమహాదేవ శంకరుడని కొనియాడెరు ॥ సాం॥ శంబరమున నెల్లప్పుడు ప్రవేశించెడ భక్తులమునె - గంభీర స్వభావుడనే - గజచర్మాంబర ధరుడను -సాం- నాగభూషణుడా - జగదీశుడ పరమేశుండని కొనియాడెరు -సాం- బాగుగాను వరములొసగి భక్తులాను యెల్లప్పుడు - యీ జగతిని పోషించెటి - యీశుడ భవనాశకుడను -సాం- నీలకంఠుడరా - మైలైన కూశదర్పణి పురవాసుడ -నీ- చాలగ నరసింహదాసు కీలోనను యెల్లప్పుడు మేలౌన గూర్చెటివాడను మేదినిలో నేమారక -సాం॥

పార్వతి—దర్వు.

శాంభవీ నమ్మా - శంభునిప్రియ రాణి యనీయందురె కొమ్మా॥ శాం॥ శంబరమున వరుని సేవసలుపుచూను ముందు నెపుడు - అంబిక యని బిల్తురు యీశంభిణిలో గలవారలు -శాం- సుందరీ మణినీ - నా - యందు ప్రేమలుంచుచు వరుడెందును జనులూ - సుం- ముందుగ నాతో దెలిపీ - ముదముతోడ భక్తులకడ - యందునేగి వరములొసగు - ముందుగాను ముదముతోను -శాం- మరువనూ మది నీ - మురహరుడా కుశదర్పనగరి - గిరిధరునీ శ్రీహరినీ -మ- పరివరి విధముల నేను ప్రస్తుతింతు నెల్లప్పుడు - గరిమతో నరసింహదాస - కవివరునేలిన వాడని ॥శాం॥

వ. ప్రాణేశ్వరా నాదొక మనవిగలదు వినుడురా.

శం-వ. చెలీ అదేదో విన్నవించుము.

పార్వ—పర—సంవాదం

పా॥ నామనోహర వినుతెల్పెద - నామదినను గల కోరిక -నా- భూమిలో చిత్రము జూడగ - బోవలె ననియును నాకిక- బుద్ధిజనించెను వినుమిక -నా॥

వ. ప్రాణేశ్వరా నామనంబున భూలోకంబునం గల్గు వింతలను జూడవలెనని యున్నది పోవుదము పద.

శం॥ కాంతా భూలోకమునను - వింతలు యేమియుగలవిక - కాం- సంతోషముతో మనమున - యింతలో బోవగవలెనని - యింతీ గోరుచు నుంటివి -కాం॥

వ. ప్రాణేశ్వరీ భూలోకంబున యేమి చిత్రంబు గలదు అచ్చోటి

పా॥ బుద్ధిజనించెను నేడును - భూమిన చిత్రిము జూడను ॥బు॥ వద్దని పల్కగ వలదిక -- యుద్దేశమున మీరలునా - నుద్దుల జాలింక వలెను ॥బు॥

వ॥ నాథా నేనెన్నడైన కోతీనా యీనాడు వలదనక నాకో ర్కె జెల్లింపుము.

శ॥ అటులైతెను జనుదము యిక - కుటిలాలకి నీకోరిక ॥ అ ॥ కటువేగంబున దీర్చెద - తటకున వృషభము నెక్కియు - హరమేచను పదుపదుమిక ॥ అ॥

వ. సఖీ నీవను విధమున నే పోవుదము పదుము.

పా॥ సంతస మాయెను నామది - కాంతా మీరలునను విధి - నం- యింతలో బోదము పదుమిక - సంతోషంబున నేనిక - యెంతయు భూలోకమునకు ॥సం॥

వ. నాథా నీవయార్ద్రి హృదయంబున కేను సంతోషించితిని అటులే పోవుదముపద.

శం॥ భూమిన కుశకర్ణి పురి - ధాముడనగు నేనిప్పుడు ॥భూ॥ భూమిన చిత్రిము జూడను - నామనోహరి నిను గూడియు - ప్రేమతో జనియెద నిప్పుడు ॥భూ॥

వ. చెలీ యింక నాలస్యంబు జేయవలదు రమ్మా.

పా-వ॥ నాథా యిదే వచ్చుచుంటిని శమ్మా. (నిష్క్రమిం)

కుశా—దర్వు—ఏక.

పురహర నీవిటురావా - మొరవినలేవా దేవా - సరగూనిపుడు నీచెంతా - కరుదెంతుసయ్య యిదెంతా -పు- యీజలనిధిలోనూ - యి పుడు మరణించిననూ - నేజూడగలను నిన్నూ - నిజమూ యీమాట నమ్మా పు॥ ధర కూశదర్పణీశా - ధవళాంగ పార్వతీశా - దరిజేర్చు కోవనన్నూ - పరమేశ మరువనిన్నూ ॥పు॥

వ. హాశంకరా నేనీ సముద్రింబున బడి నీదరి జేరెద నన్నాదరిం పుము. శంక—పార్వ—వాదం—దర్వు.

పా॥ అదుగదుగో కనుగొను ప్రాణేశ్వర - యబ్ధిలో బడుచున్న వారలెవ్వరో ॥ మదిలోకల భీతింత లేకను - మరణమొందు కారణం బేమొకా ॥అ॥

లేదో విన్నవించుడు.

కం॥ అడిగిన వారికి ఖండించుమను యుక్తి ! అంబి వినుకద ఖం భిని లోపల ॥ అడుగబోవ వశపడజాలక యూ - బుడుకేడు జలధిలో బడ నుండెను విను ॥ అ॥

వ॥ ఆకన్యలతండ్రి అడుగవచ్చిన నారినెల్ల వధింపుచుండెను. యీ పురుషుండట్టి కాఠిన్యము కు సహించక, మరణింప నిశ్చయించు కొనెను వింటివా.

పా॥ వుకారికి నుపకారము జేయని - దవకారము గాదామన యోంట్లను ॥ యిపుడు మనము నేగివాని కోరిక - సఫలము జేసిన సంతస మౌామది ॥వు॥

వ. నాథా ఉపకారము జేయబోయిన నపకారము సిద్ధించునట్లుగా వున్నది. కావున వాని యీవదల మనము తీవ్రవలయును యూర్కుం డుట మనధర్మము గాదుగదా.

శం-వ. (తనలో) ఏమీ యీతడు వారితో నెందేగినను యేదో యొక సంకటంబు రానేవచ్చును. వలదన్న వినక సలగియుందురు) సరే వానికోరిక నెరవేర్చెదగాక.

శం॥ నారీమణిరో పోడము పదుమిక - శూరుడైన కాక్రిబుద్ధి కడ ॥ జేరియు కుశదర్పణి వానుబమని- కోరవరములు ధీరతో నివ్వగ॥నా॥

వ. సఖి నీవనువిధంబుననే వాని కోర్కెదీర్చి వచ్చెదము పద.
పా-వ. అటులే పోవుదముపద.

కు-వ. ఏమీ నేనీ సముద్రింబునం బడి మరణించుద మన్న నేనెం తదవ్వేగినను. యీజలంబునన్ను ముంచివేయక తేల్చివైచుచున్నది హా శంకరా నేనేమి జేయుదును.(అంతలో పార్వతీ పరమేశ్వరులు ప్రసన్నమై)

శంక—దర్వు—ఆది.

భక్తా నీభక్తికేను - మెచ్చితి యిటువచ్చితి - కృపవచ్చెను విన రా - నినుమెచ్చితి గనురా - వరమిచ్చెద గొనురా - యిటువినరా - కనుగొనరా - సంజరముతోడ ॥భ॥ నీతో సరిభక్తుడు యీ భూతలమున లేడనీ - నీనీతులు వింటి - భక్తిఖ్యాతిని గంటి - వరమిచ్చెదనంటి - విన వేరా కనవేగా - కామునని యిపుడు ॥ గ॥ దారుణికుశదగునదరి దానుక

నగుకేళిను ! కరుణా జాతురా ! నిను గాచి బ్రోచెదరా ! నీ కింకరయా వింటిరా ! మా మూలా ! ఘనమూగ చింతేల వలదు ॥భ॥

వ. భక్తానీవెవరి గురించి వేడుచుంటివో అట్టి శంకరుండిచ్చోటికి విచ్చేసినాడు కనుగొనుము.

కళా - దర్వు - అట.

శం: భోనపాశిమ సాంబ దయాళో ॥శం॥ నంజరమూలా సరగూన యిటకూ ! అంబికనూ గూడి యరుదెంచినావా ॥శం॥ దీనదయాళో యీ దీనూని బ్రోవ ॥దీ॥ మనమూన నెంచీ ! నెనరూచె మించీ ! యీ ! దినమూను నేడిట కరుదెంచితివా ॥శం॥ దీనపోషా నాదిక్కునీవంటీ ॥దీ॥ మానజాలను నిన్ను ! మదిలోననూ నన్ను ! గానకళజర్జణీశ ! కాపా డుము శ్రీశ ॥శం॥

వ. శంకరా పాపభయంకరా యీ దీనుని మొగాలకించి యింద రుదెంచితిరా దేవా మహానుభావా. (అని పాదములకు మొక్కును)

శం-వ. భక్తా నీభక్తికెంతయు నేను మెచ్చితిని గాని నీవెట్టి వరంబు గోరెదవో కోరుము తప్పక నేనిచ్చువాడను.

కు-శం॥ వన్నెగ భూషణ వినుమిక ♦ క్రిన్నన యీరాజు పుత్రి కలకోరకైనే ♦ యిన్నాళ్ళనుండి శ్రమపడు ♦ చున్నను నాకిచ్చునట్లు యొప్పింపుశివా ॥

వ. శంకరా నామిత్రుడైన మదనవిజయుండు యీ రాజు పుత్రి కలపై మోహబంధంబున జిక్కియుండెను. కావున వీరినాతడు లభించు నట్లు వరంబు దయసేయుము దేవా మహానుభావా.

శం-కం॥ మెచ్చితి నీసద్భక్తికి ♦ యిచ్చితి వరములను నీకు యిం పలరంగన్ ♦ వచ్చెదను భీమపురమును ♦ చెచ్చెర కన్యలనునీకు జెందగ జేతున్ ॥

వ. కుశాగ్రబుద్ధీ నీ సుగుణంబుల కేనుమెచ్చితిని గాని నీ విప్పుడే భీమపురంబున కేగి రాకన్యల కొరకు విచ్చేసితినని గ్రామంబులో నుండు ము నేనిప్పుడే భీమరాజువద్దికేగి నాతని పుత్రికలను నీకొసంగునట్లు జేసె దను నమ్ముము. యిక బొమ్ము.

కు-వ. శంకరా నీవనువిధంబున పోయెదను వేగిరంబున రమ్ము

భీమరాజు ప్రవేశం - దర్వు - ఏక.

గరితిగ్రీన్ ! భీమాపురంబునే పరిపాలించెడి ప్రభువును వినరా ॥

ధ॥ ధరణియందు భీమరాజు యనిపక్ । మరువకాను బిలుతురు గొలు తురనక్ ॥ధ॥ అష్టయిశ్వర్యంబు గలిగినబలి । శ్రేష్టుండనను విను సృష్టికి దొరనుర ॥అ॥ కష్టపడక యోగాలుని విధముగ । నిష్ఠతొ ఏపులను నష్ట పరచెదను॥ధ॥ చంపాకగంధి పుష్పాగంధి యిరుపురూ పుత్రికలనువినర॥ చం॥ యింపుతోను నాయింటను చిలిని । లింపులైనజాడజాలకుండగ ॥ ధ॥ లోలూ కుశవర్ణి । ఫాలలోచనుడు పరమ దయాళుడు ॥ యో॥ నీల కంఠు నాలోననమ్మి ధర । పాలించెటి భూపాలవరుండను ॥ధ॥

వ. ప్రహస్తా. మం-వ॥ కింభో రాజప్రదీపా.

భీమ - మంత్రి - వాదం - దర్వు - ఏక.

భీ॥ వింటివా ప్రహస్తనాదు । వీరపత్రిం వీనులలర ॥విం॥ కంటివ యౌవనైనగాని కన్యలనిపుడక్। కడుబలాఢ్యుడడిగినాను । ఖండిచవలయు నుమ్మీ ॥విం॥

వ. ప్రహస్తా నాముద్దు పుత్రికల నెవరేని యడుగవచ్చిన వారిని ఖండించవలయు వింటివా.

మం॥ ఖండింపుచు నుంటిమెట్టి దండిరాజులైనగానీ ॥ఖం॥ దండిం పుచు నుంటిమింత । దయయును లేకని । వెరువకానువిడువకాను । ధరను మేము దప్పకాను ॥ ఖం॥

వ. యీరనువిధంబున నే యెట్టి రాజులైనను ఖండింపుచుంటిమిగదా

భీ॥ విడువక వధియించవలెను । కడుబలాఢ్యులైనగానీ ॥వి॥ పురమిందు యిటులజేయ । వలయు వీరికిక్ । అడుగవలదునుడుగ వలదు । విడువక ఖండించ వలయు ॥వి॥

వ. యెట్టివలులైనగాని విడువక ఖండించవలయును నామాట జవదాటవలదు వింటివా.

మం॥ ఘనులెవ్వరు గానబడరు । ఘనబలాఢ్య వినునాలుగు ॥ఘ॥ దినములు నుండియు వీధులు । దిరిగినాయికక్ । కనబడరెరొకరైనను । కన్యలనడిగేటి వారు ॥ఘ॥

వ. ఈ నాలుగు దినంబులనుండి వీధివీధులదిరుగుచుంటిమి యొక రైనను యడుగ వచ్చిన వారు లేరుగదా.

భీ॥ మంచిది కనిపెట్టవలయు । మరువవలదు నామాటలు ॥మం॥ మంచివాక్యములచెవిమీరు । మరియు బంపినక్ । ద్రుంచెదాను । యెంచ కాను । యించుకైన వెరువబోను ॥మం॥

వ॥ సరి మంచిది మీరాప కనిపెట్టి వచ్చినవారిని వధించుచుండుడు లేకుండిన నాకష్టు ఖండించవలె మీరు చింతించకండి.

ము॥ మెట్టినవారె నన్నాని పట్టినను ఖండించగలము ॥ మెట్టిగ కుశదర్పనగరి । గౌరి వరుడీకడ । యెటువంటైన బోధవగలము । పట్టిగాను విడువబోము ॥ మెట్టి॥

వ. స్వభో పారను విధంబునసే మెలంగువారము.

భీ-వ. సరే అటులైన సంతోషము, యిక నేనంతఃపురంబున కేగువాడను.

మం-వ. రాజేంద్రాల అదో మీగురువులవారు విచ్చేయుచున్న వారు కనుంగొనుడు.

భీ-వ మంచిది రానిమ్ము.

భై - శం - వాదం - జర్వ.

భీ॥ ఆర్యా గురువర్యా వందనమును గొనుమా ॥ వందనమును గొనుమా । నామనవియు వినుమా । యింతును మీరరుదెంచిన । దెంతయు నాసందమాయెను ॥ఆ॥

వ. గురువర్యా మీరిచటి కరుదెంచుట నాభాగ్యజేమనవచ్చును. మీదరిశనంబున ధన్యుండనైతిని గదా.

శం॥ వర్ధిల్లర వసుధలోన వాసిగభూపా ॥ వాసిగ భూపా । యిన కులదీపా । ఘనమోదంబాయెనిన్ను । గాంచిన తోడను । గ్రక్కున నేడును ॥వ॥

వ. రాజేంద్రా వర్ధిల్లుము వర్ధిల్లుము నీ భక్తిజ్ఞానంబులకేను మెచ్చితిని నీవరిభక్తుండీ భూలోకంబున గానంబడడుగదా.

భీ॥ రత్నసింహాసన మిదిగో రండి మీరికనూ ॥ రండిమీరికనూ కూర్చుండుడీ యికనూ । నిండుప్రేమతోనుతోను । దండమర్పించెద దాసుడ నేమీకు ॥ర॥

త॥ గురువర్యా యీ రత్న సింహాసనమున ఆసీనులు గండు మిమ్ము సేవించి కృతార్థుడ నయ్యెదను

శం॥ మెచ్చితి కుశదర్పనగిరి । అచ్యుతుడేలూ ॥ అచ్యుత డేలూ । నీకిచ్చును మేలూ । హెచ్చుగ సంతోషమాయె । యిచ్చట నామది । యినకులాంబుధి చంద్ర ॥మె॥

భీ-వ. స్వామీ జగద్గురువో విచారింపుము.

రాగ - తాళ - సంవాద - దరువు.

శం॥ క్షేమమా భూమిపాలకా । సీమవారందరు నూ ॥క్షే॥ ప్రేమతో వచియించుమా । క్షేమము లెల్లను ॥ క్షే ॥

వ. రాజేంద్రా! మీరు మీనగరి వారలెల్ల క్షేమంబుగ నున్నవారలేనా తెల్పుము.

భీ॥ గురువర్యా మీ కృప । కరుణ వల్లను యిక ॥గు॥ ధరవాసులు మేము । దరము క్షేమమున్నము ॥గు॥

వ॥ గురువర్యా మీ కృపా కటాక్షంబున మేమెల్లరము క్షేమముగానే యున్నవారము స్వామీ.

శం॥ సంతతి యేమన్న భూ । శాంత మీకు గల్గెన ॥సం॥ సంతసమూనా నాతో । సరగున వచియించుమా ॥సం॥

వ॥ భూమీశ్వరా నీకు తేమైన పుత్రసంతానము గలిగియుండెనా తెల్పుము.

భీ॥ పుత్రులు లేరిద్దరు । పుత్రికలయ్యా వినుము ॥పు॥ ధాత్రిలో సుందరులు । ధన్యా జనించిరా ॥పు॥

వ. నాకు కుమారులు లేరుగాని యిద్దరు పుత్రికలు గలరు. (అని పుత్రికల వంకజూచి) పుత్రికా రత్నములారా యిటురండు గురుమూర్తికి వందనంబాచరించుడు.

చం-వ. తండ్రీ మీరను విధంబుననే వందనంబాచరింతుము. (శంకరునితో) గురువర్యా మావందనంబు చేకొనుడు.

శం-వ. రాజేంద్రా నిన్నొకటి యడుగవలసియున్నది.

భీ-వ. స్వామీ అడుగుడు సంశయింపకుడు.

శం॥ యిట్టిసుందరులనూ । మెట్టి పురుషులాకునూ ॥యి॥ పట్టియా వివాహమునూ । పరగ జేసియున్నవూ ॥యి॥

వ॥ ఈ కన్యలు నవయవ్వనులై యుండిరి కావున వీరికి వివాహము జేసియుంటివా తెల్పుము.

భీ॥ వివాహము జేయలేదూ । వింటిర యింతవరకూ ॥వి॥ అవనిలో కుశదర్పణీ । హరికృపనూ దెలియదు ॥వి॥

వ. స్వామీ వీరి యందచందముల నెప్పుడు నాకన్నులార జూచి సమ్మోదించి చుటకుగాను యింతవరకు వివాహంబు జేయనైతిని వింటిరా

శం—దరువు—చెలి.

ఓరీ - యీకన్యలకనుఁ రోరీ - వివాహంబును జేయకోరీ - యింటను యుంచితివోరీ ॥ఓ॥ యెంతకాలమ్ములాఁడు నీకు యింతలో గతించినావు ॥ఓ॥ నీవరి పాపాత్ముఁడవటు జూచినను గానరాడు - మోసమ్ముచే సితివిర । దోసకారి నన్నికను - దాసుడనని దొన్నవలను ॥ఓ॥ భాసురమున శరణుగని వాసుడవని ననుదెలియక ॥భా॥ దోషకారి మదముచేత - తులదూగుచు నుంటివౌర - మోసముచ్చె దెరుగలేవు ॥ఓ॥

వ॥ ఒరే పాపాత్మా యిప్పుడే యీకన్యల నెవరికైన యిచ్చి వివాహంబు గావింపుము. లేకుండిన నీరాజ్యంబును నిన్నును జలంబులో గల్పెదగాక. చూడుము నేశంకరుండనని తెలియువా రేమి (అదృశ్యుం డగును)

భీ-వ॥ హాశంకరా పాపభయంకరా మారురూపంబున మద్గృహంబునకు విచ్చేసి కోపంబున శపించి అదృశ్యుండ వైతివా నేనిపుడే యీకన్యల నెవరికైన నొసంగి వివాహంబు గావించెదగాక. లేకుండిన యేమి విపత్తులు సంభవించునో కదా (మంత్రింజూచి) వక్రిహస్తా.

మం-వ. రాజన్ యేమి యాజ్ఞ.

భీ—వక్రిహ—వాదం—దరువు—ఆట.

భీ॥ కంటివా ప్రాహస్త నాదగు - కన్నపుత్రికలకును ॥ వింటివా వివహములు జేయగ - నుంటి నేటిదినంబును ॥కం॥

వ. వక్రిహస్తా నా పుత్రికలకు నేడే వివాహంబు జేయవలయును వింటివా.

మం॥ అడుగవచ్చిన వారినెల్ల - హతముగా గావించియు ॥ పుడమి యందున యిట్లు బల్కుట - పూని తెల్పుము విందును ॥అ॥

వ. రాజేంద్రా నీపుత్రికలనడుగవచ్చిన వారినెల్ల హతమొనరించి నేడు వివాహంబు దలపెట్టుట యేమి కారణమో విన్నవించుడు.

భీ॥ కన్యలకు వివహంబు జేయ - కున్న తెల్పెద విన్నవా ॥ వన్నెగా భరణుండు రాజ్యము - పాడుజేతనె కన్నవా ॥క॥

వ. కన్యలకు వివాహంబులు జేయని యందులకు యీ శంకరుడు మారురూపంబున వచ్చి, నీపుత్రికల నెవరికైన నిచ్చి వివాహంబు గావింపుము లేకుండిన నీరాజ్యము పాడుజేయుదు నని నేను వింటివా.

కటకున వచియించుడీ మేమెటకునా జనవరెనికన్ ॥యి॥

వ. అట్లైన పరేశాని మాకేమిజేయాజ్ఞనో తెల్పుము,

భీ॥ మనమ్మేరపు కన్యల కొరకు నేమే - మానిస్థలూ నేమే తెంచినన్॥ యీ - దినమునను దోడ్తెండి వీరలు - యిప్పుడె వేవేగంబునన్ ॥మ॥

వ. మన పట్టణంబుకు నాకన్యలకొరకెవరేని వచ్చియుండిన మర్యాదతో వారిరిందు రెండు తప్పక వివాహంబు జేసెదను.

మం॥ పోదుమూ మీరను మింథబే - మేదిని కుశదర్పణీ ॥ కూర్థ వుండే బ్రోవగలడూ - మనలనూ రొల్లప్పుడున్ ॥పొ॥

వ. సరే మీరనుజ్ఞే జేయుదుము సెలవొసంగుడు॥

భీ. వ. సరి అట్లతే పొండు వేగిరమున రండు,

మంత్రి - పద్యు - ఏక.

ఇలజనులందరు దెలియుండీ - నావాక్యము నిశ్చంబిది మోదము నన్ ॥ మోదమునన్ కాదనకిన్ ॥ఇ॥ భూమీశుండగు భీమరాజతన - ప్రేమసుతల వివాహము జేయన్ ॥ రొత్నించెన్ - సత్యంబున్ ॥ఇ॥ వినుడిక నేటిదినంబున రొట్టె ౹ ఘనులైనను యడిగిన నిచ్చున్॥ యిచ్చునటన్ - మెచ్చునటన్ ॥ఇ॥ రెవరైనను యీ కన్యల కొరకూ - రేతెంచిన యిటు రావలయున్ ॥ రావలయున్ - కేవలమున్ ॥ ఇ॥ వరకుశదర్పణి వానునికృప - రెవ్వరిరొమెత గలదో నేడికనూ ॥ నేడికనూ - చూడగనూ ॥ఇ॥

వ. ఓసభికులారా నేటిదినము భీమరాజు తనపుత్రికలవివాహంబు గావించ ప్రతిజ్ఞ జేసియుండెను కావున రెవరైన కన్యలకొరకు విచ్చేసి యుండిరేని రండు వివాహంబు గావించగలడు వినుండు.

కుశా-క॥ ఓమహానీయా మీరలు ♦ భూమీశుని సుతలకొరకు పురవాసులకున్ ♦ ప్రేమతో రెల్పుచు నుంటిరి ♦ నామది వినగోరె నయ్యా నది వినిపించూ॥

వ. మహాత్మా మీరెవరు రాజపుత్రికలకు నేడే వివాహంబు గావించెదమని పలుకుచుంటిరి అది నిక్కముగా వచింపుడు.

మం-వ. అయ్యా నేనా భీమరాజు ప్రధానిని వింటివా.

కు-వ॥ అట్లైన పరేశాని యొక్క మనవి.

కుశా—మంత్రి—వాదం—దద్వ.

వ॥ రాజేంద్రా నేను మన పురంబునకొక సత్పురుషుడు విశ్వేసి యనుకున్నవాడు వింటివా.

భీ॥ నెంచుకొరకు వారునూ - యిందువచ్చి నారునూ ॥ నెం ॥ విందును వినిపింపు నాతో - యిందును వేగంబునూ ॥ నెం॥

వ. ఆత డెందుకొరకిందు విశ్వేసి యుండెనో తెల్పుము.

మం-వ॥ అడిగెను నీసుతలనూ - పుడమినా శా యిటువినూ ॥ అ ॥ అడిసియు రాకుండెను మీనా - జాగ్రతలను నెంచియూ ॥అ॥

వ. మీ పుత్రికల వరించె విశ్వేసి మీ ప్రతాపంబు విని యిందు రాక మళ్ళి తమపురంబునకే కేగనుండెను వింటిరా.

భీ॥ వేగమె పోపొండికా - అతి వేగమె దోడ్తెండికా ॥ వే॥ జాగు సేయ వలదు సుమ్మి - వేగమె నామాటనమ్మి ॥వే॥

వ॥ అటులైన మీరతి శీఘ్రంబున పోయి ఆతనినిందు బిలచుకొని రండు నామాట వినుండు.

మం॥ రానని పలికెను మీమా - రమ్మనిమెను వేగవినుము॥ రా॥ మానవేళ వినువిన్నా - మరియు దోడుకొని రమ్మనె ॥రా॥

వ. రాజేంద్రా నేరమ్మన్న రాడాయెను మిమ్మే రమ్మనిమెను మీరు వచ్చినంతవరకు రాననెను వింటివా.

భీ. పోదము కదు కుశలర్పణి - మాధవునీ మదిశమ్మితము ॥ పో ॥ యీనాదినమే తోడితెచ్చి - వివహము గావించవలయు ॥పో॥

వ. సరి అటులే పోవుదము పద నేటిదినంబున నాతని నిందు దోడ్తెచ్చి నాకన్యల నిచ్చి వివాహంబు గావించెదను.

భీ—కుశా—మాదః—దర్వ—ఆది.

భీ॥ రాట్తనయా వినుమికా - రారమ్మి పోదమిక॥రా॥ రమ్మి నామది సమ్మతమాయెను - నమ్మినాదు గృహమ్ముకు నీవిక ॥ రా॥

వ. రాకుమారా నిన్ను జూచినంత మాత్రంబున నామనంబు సంతోషించెను రమ్ము మా గృహంబునకు బోవుదవు లెమ్ము.

కు॥ సంతసమాయెనుమదీ - యింతలో మీరనువిధీ ॥సం॥ చింత లేమి లేవుగాని వినుభూ - శాంతానామది గలదొక్క కోరిక ॥సం॥

వ. మీరనుమాటలకు నేను సంతసించితిని గాని నామదిలో నొక కోరికగలదు వింటేని విన్నవించెదను.

వచించిన తానే పెండ్లి సేయ - కన్యకా సేవిర్పడ వేగము ॥సీ॥

వ. సీమనంబున నెట్టి కోరిక గలదో విశదంజేయుము మీ కోరిక తప్పక నెరవేర్చగలను.

కు॥ చంద్రాయుధమునకును - చేయగవలె వివాహమూ ॥చం॥ ముందుగాను వివరింపతి మత్ గృహా - మందాలి నడువాడి యిందూను మీతోడ ॥చ॥

వ. వివాహా వేళలో నా చంద్రాయుధమునకే కన్యలను వివాహము జేయవలయును. యిది మాయింటి నడవడి ఇందుకు మీరొప్పితి రేని నేను మీ వెంట వచ్చెదను.

భీ। మంచిది మీ మనువిధీ - మరువక జేసెదనదీ ॥మం॥ చంచలంబు జెందబోవ వలదిక - కొంచపఱయు నాదువాక్యము నిజమని ॥మం॥

వ॥ సరి అటులే గావించెదను రండు ఆలస్యంబు వలదు.

కు॥ పోదమటూలైతె నికా - వడువడుడీ మనమికా ॥పో॥ మేదిని కుశదర్పణి వానూ నగు - మాధవు సేలుసు మీ మనమునతో ॥పో॥

వ॥ అటులైన ఖరే పోవుదము పదుడు.

భీ-వ. ఖరే రక్ష పోవుదము (మంత్రివంకజూచి) మంత్రివర్యా మన పురంబునంగల్గు విప్రోత్తములను రావించుము నేడే మత్ పుత్రికలకు వివాహంబు గావించవలెను.

మం-వ. అటులే మీయాజ్ఞను సారముగా రావించెదను.

బ్రాహ్మణుడు ప్రవేశం—దరువు.

భూసురోత్తముడా - ద్వారక - యీవసుధలోనా ద్వారక॥ భూ॥ నాసరి విద్వాంసులు యీధాత్రిలో - చూచిన లేరెందు ద్వారక ॥భూ॥ అమరవేదములునూ ద్వారక - క్రమముగ దెలిపెదరా ద్వారక ॥ అ ॥ భూమీశుండైనా ద్వారక - భీమరాజుకడనూ ద్వారక ॥భూ॥ యీవేళనా నివుడేగవలయునే - ప్రేమతో బిలచెనికా ద్వారక ॥భూ॥ కుశదర్పణి హాటుడూ ద్వారక - బ్రోవగలడు నేడూ ద్వారక ॥కు॥ పశుపతి నామము పఠియించినవా - రికి దొలగును భవమూ ద్వారక ॥భూ॥

వ. సరి మంచిది నేటి దినంబున భీమరాజుగారెందులకో నన్ను బిలిపించి యుండిరి పోయి విచారించెదగాక.

భీ-కం॥ వందనము భూసురోత్తమ ♦ యిందును నాపుత్రికలకు ♦ ఇకలగు ముల ♦ పొందుగ జేయగ గోరితి ♦ సందముగను శుభము

హూర్త ♦ మరయుడి విారల్ ॥

వ. భూసురోత్తమా నేడు నాపుత్రికలకు వివాహములు జేయ నిశ్చయించితిని కావున సుముహూర్త మెప్పుడో వచింపుము.

శా౹-వ. రాజేంద్రా నేడే సుదినము తప్పక జేయవచ్చును,

భీ-వ. సరే అటులైన సంతోషము. మంత్రి మత్ పుత్రికలనిందు రావించుము.

మం-వ. అటులే రావించెదను.

చం-వ॥ జనకా మమ్మిందు రప్పించిన కారణమేమో వచింపుడు.

భీ-వ. పుత్రికా రత్నములారా నేటిదినంబున మీకు వివాహంబులు జేయ నెంచితిని వింటిరా.

చం-వ. తండ్రి అటులైన మాభాగ్య మేమనవచ్చును.

భీ-వ. విప్రవర్యా వీరికి విధి విధానముగా వివాహముల గావింపుము.

శా౹-వ రాకుమారా యిటురమ్ము.

కు-వ. విప్రోత్తమా నామనవి వినుడు.

గీ. ఇట్టి చంద్రాయుధమునకే యింతులకును ♦ ముందుగను తలం బ్రాలును ముదమారబోసి ♦ పొందుగను కంకణంబుల బొనగగట్టి ♦ వరుస గావించరయ్య వివాహమిపుడు॥

వ. విప్రోత్తమా యీ చంద్రాయుధంబునకే కంకణంబుగట్టి వివాహంబుల గావింపుడు యిది మాయింటి లాంఛనము వింటిరా.

బ్రా-వ. హేరాజన్ వింటివా యీరాయువకుని వాక్యంబులు.

భీ-వ. అటులే వారి పూర్వుల నడువడినే కానిండు.

బ్రా-వ. సరే అటులే గావించెదను

శ్లో॥ తదేవలగ్నం సుదినం తదేవ - తారాబలం చంద్రబలంతదేవ
విద్యాబలం దైవబలం తదేవ - లక్ష్మీపతేతేంఘ్రి యుగంస్మరామి॥

చంప—దరువు.

రాకుమార రారమ్మిక - రతికేళికి వేవేగను - రతికేళికి వేవేగ ము ॥రా॥ నాకువరుని నిన్ను జేసియొసగిరి - సాకుమంచు నిన్ను వేడు చుంటిని - నీకు దాసురాలి మదనుబారికి - నిలుకజాల చలమదేల ॥రా॥

వ. ప్రాణేశ్వరా నిన్ను వివాహంబు గావించుకొని సంతోషంబు జెందితిని రమ్ము కౌగిలిమ్ము.

కు-వ. (తనలో) నీవలో పెండ్లి వివాహంబాడి నా చేతిలో జిక్కిం చుకొనుటకు గాను వీరిద్దరును రతికేళికి నమ్మని బలుకుచుండిరి గదా వీరిం గలసిన నా ప్రయత్నంబంతయు వ్యర్థమాయను కాన వీరికేదో యొక కథ ఙను దెలిపి దినంబులు గడిపెదగాక, (ప్రకాశముగా) నారీమణీ నాకొక కథ జ్ఞప్తికి వచ్చెను, ఆకథ నీకుం జెప్పెదను అది ముగిసిన పిమ్మట నీ మనోరథంబు నెరవేర్చెదను.

చం.-వ. నాథా ఆదెట్టి కథనో విన్నవించుము.

కు-వ. సఖీ యీభూమియందు నొక ధనికుండు గలడు. వతనికొక పుత్రిక యుండెను. ఇట్లుండ వారికడ కొకనాడు యిద్దరు సాధు పురుషులు విచ్చేసిరి. అంత నాతని పుత్రిక యీ సాధువులను గాంచి వారికి భోజనంబులు జేయించ దలపెట్టెను. తండ్రి యీ మాటకు సమ్మతించక యుండినప్పటికిని శాంతింప జేసి యీ సాధువులకు కుడువం బెట్టెను. వారు కుడిచిన పిమ్మట యీనాడా నగరియందు ఒక్క దరిద్రునకు పుత్రుండు జన్మించెను. యీసంగతి సాధువు లెరింగి యీధనికుని ద్రవ్యంబు యీ చిన్న బాలికను వారికి జెందజేయ వలయునని పలికి యదృశ్యులైరి. ఆమాటలు ధనికుని కూతురు విని తండ్రికిం దెల్పిన యాతడా బాలుని యెన్ని శ్రమలం బన్నినగాని కడతేరి తుదకు ధనికుని గృహంబున కధికారి యయ్యెను. కావున అటువంటి పురుషుండు నిన్ను వివాహ మాడవల యునుగదా వింటివా.

చం-వ. నాథా వింటినిగాని రాగమ్ము క్రీడింతము.

కు-వ. సఖీ అదో సూర్యోదయ మగుచున్నది మనమిందుండవలదు నావలికి నేగుదము రమ్ము. (నిష్క్రమిం)

పుష్ప—దర్వు.

నామనోహరా నేడిటు - రతికేళికి రారమ్మిటు ॥నా॥నామనంబు పంటరంబు జెందగ - ప్రేమమీర కౌగిలిచ్చి నెంతయు - కాముకేళి సల్పి నాదుకోరిక - కడతేర్చుడు - మదినీర్చుడు ॥నా॥

వ. మనోహరా నేడు నాభాగ్యము ఫలించెను రారమ్ము కౌగి లిమ్ము.

కు-వ. సఖీ నీకొక దివ్యమైన కథను జెప్పెదను ఆకథ ముగిసిన పిమ్మట నీకోరిక నెరవేర్పగలను వింటివా.

పు-వ( అది యెట్టికథనో వినంజేయుము.

కు-వ. సఖి యీ హస్తినాపురంబున నొక జూదరి గలడు. అతడు జూదంబున సంపదనంతయు పోగొట్టుకొని తుదకు పాపమరణంబు చెంది యమలోకమును జేరియుండెను, అంత యముండా జూదరిని జూచి వానికి దండన విధింప నెంచ, వాడు నీవు పాత యముడవా క్రొత్త యముడవా యని యా మునితో వాదింప యముడు తెలియలేక బ్రహ్మకు విచారించుటకై నేగ యా జూదరి యముని సింహాసనంబున గూర్చుండి యమలోకమును పాలింపు చుండెను. అట్టి చతురతగల పురుషుండు నిన్ను పెండ్లాడ వలయును వింటివా,

పు-క. నాథా వింటిని గాని రారమ్ము కౌగిలిమ్ము

కు-వ. సఖి అదో సూర్యోదయంబగుచున్నది మనమిందు నుండ వలదు నావలకు బోవుదము రమ్ము.

పు-వ. సరి అటులే పోవుదము పదమ్ము.

చంపకగంధి—దరువు.

మదనతాపము చేత నామనసు నిల్వగ జాలదూ। మనముతోను నాదు కోర్కె నేడును - వదలజేయు నుదయ్యెనేటి దినమును - సదయ నిన్ను వేడుచుంటి నికబల్ - సారసాక్ష దీనరక్ష ॥మ॥

వ. సఖా నేడైన నా మదన తాపంబు దీర్చి నన్ను సంతోష పెట్టుము

కు. వ. సఖి నేనొక చిక్కని కథం జెప్పి నీ మనోభ్రాంతి దీర్ప గలను,

చం-వ. సరి అదెట్టికథనో వినంజేయుము.

కు-వ. సఖి ఒక రాజున కిరువురు పుత్రులుండిరి. నారాజు శత్రువులకు తనరాజ్యంబు నోడి తన పుత్రుల నొక గురువునొద్ద విద్యనేర్చు కొనుటకై నొప్పగించివారు జీవనోపాయంబు జేయుచుండిరి. వారిరువురిలో చిన్నవాడు విద్యల నేర్పరియై యుండెను. అంత కొన్నాళ్ళకా రాజు వచ్చి గురు దక్షిణగా తన పెద్ద కుమారుని నొసంగి చిన్నకుమారుని గొనిపోయెను. పిమ్మట యాగురుడా బాలకుని కెన్నో హింసలు బెట్టెను. అదిజూచి యా బాలుడు గురుని ఘాతంబు గావించెను. అట్టి ధైర్యశాలివంటి వానిని నీవు పెండ్లాడవలయును గదా వింటివా,

చం-వ. నాథా వింటినిగాని రమ్ము నన్ను రతిక్రీడలందేల్పుము,

కు-వ. సఖి అదో నిసుడుదయించుచుండెను మనమిందుండతగదు,

నావలకు బోవుదము పదుము.

చం-వ. సరి అటులే పోవుదము పద.

పు-దరువు॥ విరహామానేసహా సుకన్య - దరిజేర్చుమి సన్నుతనే ॥ పి॥ పలువిధముల నిన్నును - బ్రస్తుతి జేసెదనిన్నును - మరుకేళియు సలిపియు నా - మదినిదీర్చు - మదనుడ గూర్చు ॥వి॥

వ. ప్రాణేశ్వరా నామనంబు నిలువకున్నది రమ్ము క్రీడింతము.

కు-వ. నారీమణీ నేడొక కథ నెరిగించెదను వినుము, అటుపిమ్మట నీమనస్సు తృప్తి గావించెదను.

పు-వ. సరి ఆదెట్టికథనో వినం జేయుము.

కు-వ. మనోహరీ ఒకరాజునకు యిరువురు భార్యలుగలరు. అందు చిన్నభార్య శాళికాదేవియని ప్రాణంబు యామెవరంబున బంగారు జడలు గల కుమారుని గనియుండెను. ఈసంగతిని రాజుగారి పెద్దభార్యయని పర దేశపురాజు నిన్ను రమ్మని యుండెనని పత్రంబు లిఖించి తన పెనిమిటి వద్ద కంపెను. యాపత్రంబు జదివుకొని రాజు పరదేశమున కేగెను. నంత నామె తన సవతి పుత్రుని జంపదలచి పెక్కు విధంబుల కష్ట పెట్టెను కాని యా బాలుడా శ్రమలన్నిటిని భరించి తుదకు తండ్రిని గలుసుకొని సుఖముచుండెను. అటువంటివాడుగదా నిన్ను వివాహమాడ వలయును వింటివా.

పు-వ నాథా వింటినికాని క్రీడింతాము రమ్ము.

కు-వ. సఖీ అదో చూడుము తెల్లవారవచ్చెను మనమిందు నుండ రాదు నావలికి బోవుదము రమ్ము.

పు-వ. సరి అటులే పోవుదము పదుము.

చం-దరువు॥ శాళికేని వ్యాళి నేను - యీలీలను దరిజేర్చుమి ॥శా॥ చాలగ మదనుని కోలల - కీలలకును భరియింపగ - జాలకనున్నది నా మది - యాలచాల - తపనదేల ॥శా॥

వ. నాథా యీవిరహ వేదన భరింపజాలను రమ్ము క్రీడింతము.

కు-వ. సఖీ నామనంబునంగల్గు నేడొక చిన్న కథ దెల్పెదను వినుము. యాకథ ముగిసిన పిమ్మట రతిక్రీడలం దేల్పెదను.

చం-వ. సరి ఆదెట్టి కథనో వినం జేయుము.

కు-వ. ఈ భూమియందున నొక రాజకుమారుండు తన తండ్రిం జూచి హేజనకా నేను యింద్రుని కుమారెను నాగేంద్రుని కుమార్తె

అగ్నిదేవుని కుమార్తెను యీ ముగ్గురిని దప్ప నేనితర కన్యల వివాహం జూడనని యామాటలు తండ్రివిని కోపించి యిల్లు వెడలించిన యాపత్ని లందరు చేరి తుదకు నొక వృద్ధురాలి వలన యింద్రుని పుత్రికను తన వశంబు జేసికొని, నామె వలన నాగేంద్రుని అగ్నిహోత్రుని పుత్రికలను చేకొని తండ్రివద్దకేగి తనప్రతిజ్ఞ నిలబెట్టుకొనెను. అటువంటిఘనుడు నీవు పెండ్లాడ వలయునుగదా వింటివా.

చం-వ॥ నాథా వింటినిగాని క్రీడింతాము రారమ్మా లేలెమ్మా.

కు-వ. నారీమణీ అదో సూర్యోదయం బగుచున్నది మనమిచ్చట నుండుటకు తగదు నావలికి పోవుదము రమ్మా

చం-వ॥ సరి అటులే పోవుదము పదుము.

పు-దర్వు॥ దాసురాల - బ్రోవవేల ॥దా॥ యీ సమయంబున నన్నును ॥దా॥ దోసిలొగ్గి యుంటివాడు కోర్కెయు - దీసివేయ వలదని కుశదర్పణి - వాసుదైన దెలుపడాయె నీకును - మోసమేల - జేసె వేల ॥దా॥

వ॥ ప్రియా మదన తాపంబుచే నోర్వకుంటిని నామనో భ్రాంతిని దీర్పుము.

కు-వ॥ సఖీ నేడొక చిన్నకథను వినిపించెద వినుము. అటు పిమ్మట నీమనో భ్రాంతి నెరవేర్చెదను.

పు-వ॥ సరి అదియెట్టి కథనో వినంజేయుము.

కు-వ॥ సఖీ ఒక రాజునకొక కుమారుడుండెను. యారాజేంద్రుడు చనిపోయిన తోడనే పాలివారలు రాజ్యం బపహరించిరి అంత నా పిల్లవాని తల్లి పుట్టింటికేగి నూరు వరహాలు దెచ్చి తన కుమారునికిచ్చిన నతండా వరహాలు పెట్టి నొక పామును నొకపిల్లిని నొకకుక్కను గొని వచ్చి పెంచుచుండెను. అదిజూచి నతనితల్లి కోపించిన నతడా సర్పమును విడచి పెట్టినప్పుడా సర్పము బాలుని కొక నద్భుతుంగరమిచ్చెను యా యుంగరము వలన రాజకుమారుండు మరల రాజ్యప్రాజితుండాయెను అటువంటిఘనుడ్ని కదా నీవు పెండ్లాడ వలయును వింటివా:

పు-వ॥ వింటినిగాని నాకోరిక నీడేర్పుము.

కు-వ॥ చెలీ అదో సూర్యుడు డుదయించు చుండెను మనమిట నుండ తగదు నావలకు బోవుదము రమ్మా.

పు-వ॥ సరి అటులే

చం-వ॥ సోదరీ పుష్పగంధీ మన నాథుండు నాతో రతిక్రీడలం జేయక జేనో యొక కథ తెల్పుచు దినంబులు గడుపుచుండెను. నీపైన నైన ప్రేమగలిగి యున్నవాడా తెలుపుము.

పు-వ॥ సౌను భగినీ నీవన్నట్లె నాతోగూడ దినంబొక కథ దెల్పుచు తుదకు అటువంటివాడు మీరు పురుషుడు గావలయునుగదా యని అనుచుండెను. నదియుంగాక తన చంద్రాయుధమునకు మనల వివాహంబు గావించెను వింటివా.

చం-వ॥ సోదరీ యిది యెంతయు నేదో విచిత్రముగా నున్నది మనమిప్పుడే పోయి సతని విచారింతము పదుము.

పు-వ॥ సరి అటులే యడుగ వలయును పద.

చం-వ॥ నాథా నాదొక విన్నపంబు గలదు.

కు-వ॥ సఖీ విన్నవించుము వినియెదను.

చం—కు— వాదం—దర్వు—ఆది.

చం॥ మనోధవా మాకును దినదినమును - మరి కథ లను దెలుపుటజేలా - మనంబు నను మాకునూ ఘనంబుగ - మహా సందేహంబును దోచెగా ॥ను॥

వ॥ మనోహరా మమ్మ వివాహంబాడినది మొదలు ప్రతిదినము మాయిరువురకు కథలం దెల్పుచుంటిరి తుదకు అటువంటి పురుషుడు మీరు కావలయునుగదా యని యడుగుచుంటిరి అందలి భావమేమో తెల్పుడు.

కు-వ. (తనలో) ఆహా నేడీ కన్యలు నన్ను ప్రశ్నించు ప్రశ్నలకు తగిన సమాధానము జెప్పకున్న నన్ను దూషింతురు గదా.

కు॥ మీరు కరము లింద్రపురంబునను గా - రీధవునీ దేవళి మంద - ॥మీ॥ మాదు రాజ పుత్రుండు గాంచియు - మరి మిమ్మును దెచ్చని దోలెగా ॥మీ॥

వ॥ సఖీ రత్నములారా యిందప్రపురమందలి దేవాలయములో గల మీ చిత్రపటములను మా రాకుమారుండు మదనవిజయుండు జూచి మోహంబుజెందిమిమ్మల గొనివచ్చి యొసంగుమని నన్ను దోలించిన వస్తిని వింటిరా.

చం-వ॥ ఏమీ మా ప్రాణేశ్వరుడు మదన విజయుడా వానికి నీ

కు-వ॥ నేనా మదన విజయుని ప్రధానిని నానామము కుశాగ్ర బుద్ధి యందురు.

చం॥ అటులైతేను మోదము పడుడిక మన - యింట నుండుట ఫల మేమి యికన్ - పటుతర మోహ పరవశులైతా - నెటువలె నుండెనో యేమిదో చడిక ॥అ॥

వ॥ అటులైన మనమిప్పుడే వారియొద్దకు బోవుదము పదుడి

క॥ మాకు యత్తగారి పురికేగద - మని మీతండ్రితో దెలువ వలెన్ - వినోదముతో సెలవొందిర డికా - నాదువాక్యములు నమ్మి యికన్ ॥మా॥

వ॥ మీ జనకునితో అత్తవారింటికి పోయివచ్చెదమని సెలవైకొని వేగిరంబున రండు పోవుదము.

చం॥ మీరు వచించిన విధమునను - జేరి సెలవుగొని వచ్చెదము - ఆరూఢిగ మీరను విధంబున నె - ధారుణీశుని జేరియు త్వరలో ॥మీ॥

వ॥ మీరను నట్టుల సెలవుగొని వచ్చువారము సెలవొసంగుడు.

కు॥ పొండు మీరు వేవేగమునా - రారండి సెలవుగొని రమ్యము నా - దండికుశా దర్పక వానుడు మిము - నిండుప్రేమతో నెపుడు బ్రోచును ॥పో॥

వ॥ సరి అటులే పోయిరండు ఆలస్యంబు సేయకుడు.

చంద—భీ—వాదం—దర్ప—ఆది.

చం॥ జనకా వందనములు గొనుమా - ఘనమోదంబుతో నిటు వినుమా - మనమున నొక కోరిక గలదిక నది - వినజేయుట కిందరు దెంచితిమి ॥జ॥

వ॥ జనకా మామనంబున నొక కోరిక గలిగి మీతో విన్నవించుట కిందరుదెంచితిమి.

భీ॥ మీ మనమునగల కోరికనూ - నేమిగలదో తెల్పుండికనూ - నామనమునకు సంబరము గలిగెనిక - యేమారక నెరవేర్చ గలను నే॥

వ॥ పుత్రికలారా మీ మనంబున నెట్టి కోరిక గలదో విన్నవించుడు తప్పక నెరవేర్ప గలను.

చం॥ అత్తవారి గృహమున కేగి - వత్తుమనీ మామది గోరి - యుత రవును గొన నరుదెంచితిమిట - యితుగ సెలవు యియుడు వేగమే॥

కదళిక - యిన్నిదినంబులు జరిగెనేటికిని - కన్నులారను గాంచుభాగ్యమె న్నటికో ॥ప॥ నాసారాధా - కుశతపస్వికిని దాసనన్ను యిప్పుడు - యీ శాస్త్రోక్తా - దోసిలొగ్గి యడ్గునా కన్నిక - పరాత్పరుచ్చు జేయు తగ మనీషికె - వాసవాది వందిత సరసింహా - దాసవరద నను ధన్యుని జేయవె ॥ప॥

వ॥ హే శంకరా పాపభయంకరా. యీ సమయంబున నన్ను రక్షింప నీకంటె నితరులెవ్వరును లేరుగదా. (అంత కుశాగ్రబుద్ధి కన్య లతో నటుపు వచ్చును)

కా—మ—చం—పు—వాదం—ఆది,

కు॥ కంటివారాజా - కన్యకా మణుల కనుగొంటివారాజా ॥ విం టిరమీరు వచించిన విధముగ - కంటిరి సుందర కన్యల దెచ్చితి ॥కం॥

వ. మదన విజయా నీవు కోరిన కన్యారత్నములను గొనివచ్చితిని చూడుము.

మ॥ సంతసంబాయె - యింతలోన నాచింతలు బాసె ॥సం॥ వింత వింత నేనెంతని బొగడుదు - మంతనముననిను మరువజాలనూ ॥సం॥

వ. సుబుద్ధీ నీవంటి హితుండీ జగంబున లేడుగదా నీ శీఘ్రరీతం బేమనవచ్చును వీరెచ్చోట నుండువారో తెల్పుము.

కు॥ లెండి మీరిక - యీకన్యలనూ చేకొండి సుమ్మికా ॥లెం॥ దండిరాజ పుత్రికలు సుమ్మనీ - యండజేరి నిండు ప్రేమ చే॥

వ॥ వీరు భీమపురంబేలు భీమరాజు పుత్రికలు యీమె నామము చంపకగంధి యీమె పుష్పగంధి దైవకృపవల్ల మీకు లభించెను వీరిద్ద రక్క చెల్లెండ్రు వింటివా.

మ॥ చేకొనేదానూ - నాకును జ్యేష్ఠురాలునూ వినూ ॥చే॥ ప్రాకటముగ యీచిన్న సుందరిని - నీకొసంగితి నేసంతసముగ ॥చే॥

వ. వీరిరువురిలో జ్యేష్ఠురాలిని నాకొసంగుము. కనిష్ఠురాలిని నీవు చేకొనుము అటులైన నామనంబు సంతసించును గదా.

కు-వ॥ హే కన్యారత్నములారా మారాజుగారి వాక్యములను వింటిరా ఇందులకు మీ యభిప్రాయమేమో తెల్పుడు.

చం॥ ఆరీతి మేమూ - మెచ్చిలెదాము - మారాడబోముా ॥ఆ॥ ధారుణీశునీ జేరెద నికనే - మీరుపాదు సోదరిని చేకొనుడి ॥ఆ॥

వ॥ కుశాగ్రబుద్ధీ మీరాజాజ్ఞ విధంబుగానే మెచ్చిలెదము నేను

మద — తిశా — వాదం — దర్వు.

మ॥ పోదము పద మనమికా - పోవమురో నేడికా ॥ యీాదిన మ్మానక్ - యిపుడె వేగముక్ - మాధవునీ భజియించుచు ॥పో॥

వ. నీవనువిధంబున వేగిరంబున బోవ్వుదము పద.

క॥ పదుపుపు పదము నేడికా - నడిగలడనో చూడికా ॥ ముదము తోడుత్ - మన మొగిరి పోవలెక్ కదుదుగాదు జడియకాను ॥ప॥

వ. రాకుమారా యిదో యీ నదీతీరము కు వచ్చితిమి నీటిలో నడచి పోరాదు మన గుర్రింబుల తప్పించి దాటవలయును వింటివా.

మ॥ మొగిరింతును నేనికా - వేగమే నను చూడికా ॥ దిగులు జెందక్ - దిటముతితోడక్ - మగువను నావెంటగొనియు ॥

వ॥ నీవను విధంబున నేనీ సుందరిని గుర్రింబుపై నిడుకొని నది యీవలి యొడ్డునకు జేరితిని నీవును యట్లే రమ్ము.

క॥ చేరవస్తి నేనికా - వారిని నేగూడుకా - ధీరత తోడక్ - దిగులు జెందకక్ - భరగుచాను మరియు నేను ॥జే॥

వ॥ నీవనునట్లుగానె యిమ్మొ జేరవస్తిని చూడుడు.

మ-వ. ఏమిా సుబుద్దీ మంచిా నదిని దాటిన తోడనే సుఖింగు చుండెను నడచివచ్చిన మరణంతుము గదా. యిది నీకెట్లు దెలిసెను.

క-వ॥ ఆసంగతివంతయు మన పురంబున జేరిన పిమ్మట నెరిగిం తును కాని తొందరగా ప్రయాణంబు సాగింపుము.

మ॥ వచ్చెను మనపురమికా - యచ్చట కనుపడెనికా॥ వచ్చెను యింక్ - మనకిచ్చటికి యిక్ - హెచ్చుదూరమ్మె నలేమ ॥వ॥

వ. సుబుద్ధీ అదో మన పట్టణంబు గానవచ్చుచుండెనుచూడుము.

క॥ కంటిర యీా బురుజుల్ - యీాంటక మొగరావలెక్ ॥ కంటి రాయిక్ - గన్గొంటిరా యిక్ - తంటలేమి కలుగబోవు ॥కం॥

వ॥ అదో మన పురంబునంగల బురుజులను తాకకుండ నెగిరి పోవలెను వింటివా.

మ॥ మొగిరెదాను చూడికా - దిగులదేల నాతికా ॥ మిగటిమి తోడక్ - మహా వేగిరముక్ - దిగవిడువక తురగమునూ ॥మొ॥

వ॥ నీవనువిధంబుననే మొగిరి వచ్చితిని చూడుము.

క॥ ధారుణి కుశదర్భనగరి - భామిని మదిలోన నమ్మి ॥ధా॥

వ॥ మదన విజయా శ్రీహరి కృపవల్ల క్షేమముగా మన పురంబునకు జేరితివి గదా.

శో-వ॥ సుబుద్ధీ యిదియేమి యాశ్చర్యము మనమిా బుధజాల దాటివచ్చిన తోడనే విరిగిపడెను మనము బాధజాలలోనుండి నడచి వచ్చిన యెడల మరణింతుము గదా నీవెట్లెఱిగితివో తెల్పుము.

కు-వ॥ ఆవెంగతి మన గృహంబునకేగిన పిమ్మట తెలిపెదను పదుము.

మ-వ॥ సరి అటులే పోవుదము పద (గృహములకు జేరుదురు)

కు॥ (భానురాజుతో) కం॥ వందనములు భూమీశ్వర ♦ యిందును మోదంబుతోను యిపుడును వినుమీ ♦ నందను డేతెంచినాడదో ♦ డెందములో సంతసించి యిక గనుగొనుమా ॥

వ॥ రాజేంద్రా మీకుమారుండగు మదన విజయుండు విచ్చేసి యున్నవాడు కనుంగొనుడు.

భా-వ॥ ఏమీ మత్కుమారుండగు మదన విజయుడా హా కుమారా నిన్నెన్నాండ్లకు కన్నుల జూడనైతినిరా తండ్రీ.

భా—మ—కు—పాదం—దర్వు.

భా॥ నందన నీవిటురారా - నను జేరా - ఆనందమాయె మదికి నిరా ॥నం॥ మంగడనూ నిను మహాశ్రమ బెట్టితి - డెందములోపల సందేహింపక ॥నం॥

వ॥ కుమారా నిన్ను నేక శ్రమలంబెట్టిన నావంటి పాపాత్ముండి లోకంబున గలడా తండ్రీ.

మ॥ జేరితి నేనిను జనకా - నాజనకా - భూరిమోదమాయెనికా॥ జే॥ ప్రాణమును యింతయు గానన్నది - మీ రొనర్చు నేరమదేమున్నది ॥జే॥

వ॥ తండ్రీ యెంతవారికైనను పూర్వఫలంబు దప్పదుగదా.

భా॥ సంతస మాయెను మదికీ - నామదికీ - యింతలోన నీవిధికీ॥ సం॥ యెంతని నిను వర్ణింతు సుబుద్ధి నా - చింతలెల్ల దొలుగ జేసితివి యిక ॥సం॥

వ॥ సుబుద్ధీ నీ సుజ్ఞానిం బేమని వర్ణింతును నీవల్ల నేకదా నా కుమారుని నేటికిగనుగొననైతిని.

వ॥ నామామగారితో జెప్పి నమ్మకము చేసియిప్పుడే పోయి వాని శిరంబు ఖండించి వచ్చెదను నీవిచ్చటనే యుండుము (అని పలికి వెడలిపోవును)

కు-వ॥ ఆహా యీ పతివ్రతారాలు పతి శిరంబు ఖండించి చండాలుని చేరబోవ యత్నించెనుగదా, దీని చర్యలెల్ల రహస్యమున నుండి చూచెదగాక (అంత చూచుచుండగానె చంద్రరేఖ నిద్రలోనున్న మదన విజయుని శిరంబు ఖండించుచు అభినయించి)

కు-దర్వు॥ హారహారా నేడెంత పని ఘటించెనూ - హా మదన మదన విజయు కీ నింతలో ॥హా॥ చరము ప్రాణ్యాసి శిరమునుదీసెను - పాపమునకు యీ పాపి వనితయు ॥హా॥ పురుషుని శిరమును దీయుటకు చురోం। తరి యుదీనికిని ధైర్యంబొప్పెను ॥హా॥ వరుని సంహారించియు చాండాలుని వద్దనుండ నెటులొప్పియుండెనో ॥హా॥ యీ సమయము కుశదర్పణివాను డు - యీశుడే విధి బోవగలడా హా - దాసుడు మదన విజయు డే విధమున - దక్కునోగద యిక చిక్కుదో చుహా ॥

వ॥ ఆహా యిది యేమన్యాయము చంద్రరేఖా పతిని దుంచుట నీచేతులెట్లాడెను. ఛీ అధమురాల,

చం-వ॥ (తనలో) ఏమిరా వీడు నామామగారితో జెప్పెనేని మోసమగును కావున యీ నేరము వీనిపై మోపి వీనిం శిక్షింప జేసెద. (బిగ్గరగా) ఓరీ కుశాగ్రబుద్ధీ.

మత్తకోకిల॥ ఏలరా దుర్బుద్ధి నావధు - నేలదుంచితి వీలికన్ - చాలగా మిత్రుండవనినా - స్వాతమందున నమ్మితిన్ - పాలుమాలిన వాడనీకే పాపమింతయు జేసె మా - పాలిశత్రుడనిన్ను నిప్పుడె బట్టి యిచ్చెద భటులకున్॥

వ॥ ఒరే దురాత్మా నా పతి నేల జంపితివి నేనిప్పుడే మా మామగారితో దెల్పి నీశిరంబుం దీయించెద చూడుము (అని భానురాజు వద్దికి బోవును)

కు-వ॥ ఆహా యీదురాత్మురాలి గయ్యాళితనం బేమనవచ్చును హా దైవమా యెంత గతివాటిల్లినది.

భా—చం—వాదం—దర్వు.

చ॥ ఏమనియందూ - మామ నేనిందూ ॥ప॥ నామనో హరుని శ్రేమము దెలుపూకరా - యేమికోచాదునా - నోము ఫలము యేము॥

మ॥ మామా నావరుని పాటును నేనేమని విన్నవింతును నాకు

కు॥ హేమనియు నేవిన్నవింతు నికనూ - భూవిభాక నీతో॥ నే॥ ప్రేమతోడ తాపిత్రియుని ప్రేమించియు - నాపైబన్న నిరేమి పాపమో॥

వ॥ భూమీశ్వరా యీ మదన విజయుని భార్య చంద్రరేఖ యితని శిరంబు ఖండించి యీ నేరము నాపై బడవేసెను వింటివా.

భా॥ కుటిలమానసి యిటుల జేసినావా - కటుబులని దెలియక॥ కు॥ కటకట నేగి యీ - తత్క్షణము నే - కటకట జానిని ఖండించెదనిక॥

వ॥ ఆహా యీ దురాత్మురాలింతపని గావించెనా నేనిప్పుడె పోయి యీ దురాత్మురాలిని వధించెదగా.

కు॥ మానవాధిప నామాట వినుడికనూ - యిపుడు నన్ను మన్నించుము॥మా॥ మానక విజయుడు మరల బ్రతుకును - గాన చింతలేల నమ్మి యికనూ ॥మా॥

వ॥ రాజేంద్రా నా మాట వాలించి యీపని సేయవలదు నేనెవ్విధమైనా నాపుత్రుని బ్రతికించుకోగలను.

భా॥ మృతిని జెందిన సూనుడును యింకా - యేగతి జీవించును॥మృ॥ కుతుకమునను జీవించు నేవిధియు - హితవృత్తోను నాకిపుడు దెల్పుమా॥మృ॥

వ॥ మృతిజెందినవాడు మరల జీవించునన్న నేనమ్మకుంటిని. నీ వెట్లు జీవింప జేసెదవో విన్నవించుము.

కు॥ ప్రేమమును నాకొసగు భూపాలా - దేహతీరునైనను॥ప్రే॥ ధాత్రిలోన కుశవర్ధనగరిత్రి - నేతని కృపమున కేటులో జయమగు॥

వ॥ యీ కళేబరంబు నాకొసంగుము నేనెవ్విధమైన పునర్జీవితుని గావించి నీకొసంగెదను.

భా-వ॥ (తనలో) ఏమీ యీ కుశాగ్రబుద్ధి వాక్యంబులు నామనంబున కించుక ధైర్యంబు గలుగుచున్నది సరే అటులే యొసంగెదగాక (ప్రకాశ) సుబుద్ధీ నీ భక్తి జ్ఞానంబులకేను మెచ్చితిని. అటులే యీ నా కుమారుని కళేబరంబును నీకిస్తిని గొనిపొమ్ము. (నిష్క్రమి)

కు-వ॥ సరేవాంఛిది. (కళేబరంబు గైకొని) యీ మదన విజయుని భార్య యింతపని గావించెను. నేనుగూడ నా భార్యను విడచి చాలా దినంబులయ్యెను. యిపుడు నా భార్యయైన పద్మగంధి వద్దికి పోయి జూచెదగాక (అని పోవును) పద్మగంధి ప్రవేశం—దర్వు.

నిను నమ్మియున్నానే - భక్తితో పూజింపుచునుంటి - కావవే నాపై పిడియంత కటికమూ దలచూటి యేలా ॥రా॥ నిన్నే నమ్మితినీ - యిపుడిప్పుడిన్ని దినంబులు జరిగెను వరుడూ - నన్నూ జేరడనీ ॥రా॥ నానా విధముల వేడుచునుంటి - మొన్నడూ నావరుడు రాడు చూ - నన్ను జేరుటెన్నడో యిది - విన్నవించవేలా నిపుడు ॥రా॥ పలుకావేలనే - వో కాళికా కేవి నాపై రాపంతామేలనే ॥వ॥ యిలలో కుశదర్పుణి సత్వేశుని - కలికినాపై కరుణ లేదటే - పలుమారూనే పలుకరించినను -పలుకకుంటి వేలనే నాతో యిక॥

వ॥ తల్లీ జగదంబా నేనెన్నివిధంబుల వేడుచున్నను కన్నెత్తి చూడవు నాపై దయరాదేలా నీకిదిమేలా.

కాళి- వ॥ కద్రుగంధీ నీపతివ్రత ధర్మంబునకేను మెచ్చితిని నీవు గోరు వరంబు లెట్టివో కోరుము తప్పక నిచ్చెదను

వ-కం॥ పరిణయ మయ్యిన నుండియు ♦ వరునితో గూడుండనైతి వసుధాస్థలిలో ♦ వరుడిందురాగ వరమును ♦ నరగున దయజేయుతల్లి ♦ సంతోషమునన్ ॥

వ॥ నా ప్రాణేశ్వరుడు నన్ను వివాహము మాడినుండి నన్ను జేరడాయెను నావరుడిందొచ్చు నట్టుల వరంబు దయచేయుము.

కాళి-కం॥ మెచ్చితి నీ సద్భక్తికి ♦ యిచ్చితి వరములను యేను యింతిరో వినుమా ♦ సచ్చరితుడు నీభర్తయు ♦ విచ్చేయును నేటి దినమె వేడుక లలరన్॥

వ॥ బిడ్డా నీమగడు నేడే నిన్ను జేరగలడు కావున నీగృహంబునకు వెళ్ళుము.

వ-వ॥ తల్లీ అటులే వెళ్ళుచున్న దానను. (నిష్క్రమించును)

కుశా—దర్పు.

పురహర నీ స్మరణ మరువనికా - కరుణించు నన్ను కరుణించు నన్ను వో ॥పు॥ పరిపరి విధముల ప్రస్తుతించెదను - వరములొసగి యీ వసుధ నేలుమీ ॥పు॥ నీలకంఠా నిన్ను నమ్మితినీ - నాలోన నెవ్వడూ । నీ దేలీలను యీ మదన విజయుడు - మేలుగ జీవము బొందనా కద యిక ॥పు॥ నిన్నే నమ్మితీ నన్ను బ్రోవు మీశా - కుశదర్పుణి వాసా ॥సి॥ పన్నగ భూషణ పరమదయాళ నీ - కన్న ప్రియులు నాకున్న రెవరు నిల॥

వ॥ శంకరా శత్రు భయంకరా యీ నా మిత్రుని పునర్జీవితు

ము వరుసి మతి దీరగనే । కాంతవుకో పూజించెదగాని ॥నా॥ ధరణి యందు కుశదర్పనగరిశ్రీ । ధాముడైన రాజుని ముని సీ ॥ కోరి భజించిన వారికి జయోత్సవ । కొరకు వేమియు లేదన వినయమా ॥నా॥

వ॥ ప్రాణేశ్వరా ప్రాణేశ్వరా. (పలుకకున్న తనలో) యేమీ నావరుడెన్నిసార్లు బిలచినను పలుకడాయెను వీరిపై భ్రాంతిచే నేనా కాళికాదేవిని పూజించితిని యీదేవి వలిసిన స్థలంబున విశ్వసించెను కాని నా మనోభ్రాంతి తీర్చగాయెను. నేనా కాళికి యేమపచారంబు గావించి తినో యిప్పుడే పోయి విచారించెదగాక (అని వెడలును)

కు-వ॥ తనలో) ఏమీ యీసుందరి యింతరాత్రి నన్ను విడచి యెందేగుచుండెనో దాని వెంటనంటి జూచెదగాక (అనిపోవును)

పద్మ-దరువు॥ కాళీమాతా శీలనే నాపై । కరినము యిదేలకు సుశీలా । చాలనినునే నమ్మియుంటినీ । మేలౌనా నీకిది చాలా ॥కా॥ యెందుకొరకు తెలివొందడాయెనో । యిందునాతో దెల్పవదేలా । యిందుముఖరో నాయందు నేరమేము గన నాతో వినుపవదేలా ॥కా॥ మేలగు కుశదర్పనపుర నిలచిన । కాళిక యిసీసును తగునా । యేల నాలో విన్నవించనైతివి । మేలౌనా నీకిలలోనా ॥కా॥

వ॥ దేవీ నీకింత యపచారంబేమి జేసితిని నాభర్త నాపైప్రేమ యెందుకు దీర్పకుండెనో తెల్పను లేనిమొతల యదో నీపాదంబుల కడ ప్రాణంబుల త్యజింతును.

కా-వ॥ ఏమీ పద్మగంధీ మళ్లి నీ విందేల వచ్చితివి. నీపతి నీవద్దికి వచ్చెనా లేదా.

ప-వ॥ అమ్మా నీవనునట్లుగా విశ్వసించియుంటెను కాని నాపై ప్రేమ నింతైన లేక నిద్రించి యున్నవాడు నేనెంత బ్రతిమాలి బిలిచి నను పలుకకుండెను నేనేమి పాపముచేసితిని.

కా-వ॥ బిడ్డా నీవజ్ఞానివి అట్లు బలుకకుము నీవిప్పుడే గృహంబున కేగి నీకుశిహస్తంబు నీవరుపై మోపుము నెట్టిమృత్యువైనా జీవించి తెలివొంది పలుకగలడు పొమ్ము నామాట నమ్ము.

ప వ॥ సరి నేనిపుడే నావరుని జేరి నీవనునట్లొనర్చెదను పలుక కుండిన మళ్ళివచ్చి నిన్నే విచారించెదగాక. (నిష్క్రమి)

కు-వ॥ (తనలో) ఆహా యీపతివ్రతా శిరోమణి కాళికాదేవి వరంబున మరణించిన మనుజుల బ్రతికించునన దేవినోట నేవింటినిగదా.

అటులైన నామిత్రుండు దీనిపైన వృద్ధినిపొందగుట నిక్కము. నేనిప్పు డే పోయి యొప్పటివలె శయనించి యుండెదను. (అని అట్లుచేయును)

ప-వ॥ ప్రాణేశ్వరా. ప్రాణేశ్వరా. (అని హస్తంబులంచును)

కు-వ॥ ప్రాణేశ్వరీ నావాక మానవి.

ప-వ॥ నాథా విన్నవించు విని మోదను.

కు - ప - వాజం - జర్వ.

॥ కాంతామణిరో రాగదేనా । చెంతకూ వేగమూ । వంత మేల నాపైన నీకునూ । సంతోషంబున కరగున నీవిటు ॥కాం॥

వ॥ మనోహారీనేటికిమన భాగ్యము ఫలించెను రమ్మా నావామాంకమున గూర్చుండి నన్ను సంతోష పెట్టుము.

ప॥ కాంతా మీరాలను విధీ । సంతసమూ రేమను మదీ । చింతలెల్ల వొదిలెను నామదిలో । యింతలోన నీకడ కేతెంచితి ॥కాం॥

వ॥ ప్రాణేశ్వరా మీయాజ్ఞానుసారంబుగ నటులే మీవద్దికి వచ్చితిని వింటిరా.

కు॥ నేటికి మన కోరికా । నెరవేరెను సదయుడా । పాటలాంగి నామాట నిజ బిది । బూటకమని యాడవలదు నీమదీ ॥నే॥

వ॥ ప్రాణసఖి నేటికి మన కోరిక నెరవేరెను గదా.

ప॥ ప్రేమగలిగీ నేడిటు । నాపైకయుకోనిటు । యేమిపదార్థము దెచ్చియుంటిరో । నామనోహరా నాకది దెల్పుడి ॥ప్రే॥

వ॥ ప్రాణేశ్వరా కొన్ని దినంబులకు నాసన్నిధికి విచ్చేసితిరి. నాపై ప్రేమచేత నాకేమి పదార్థము దెచ్చియుంటిరో తెల్పుడి.

కు॥ కోమలిరో వినుమిటు । ప్రేమతో తెలిపెదనిటు । నామనంబు సంబరంబు జెందెను । నాతి తెల్పెదా ప్రీతితో వినగదె ॥కో॥

వ॥ కోమలీ నీపై ప్రేమచే గొనివచ్చిన పదార్థంబా పెట్టియలో గలదు చేకొనుమి.

ప॥ భానురా కుశేదర్పణీ । దానసనీ కృపచేతనూ । దానురాలి కనికొని తెచ్చితిరే । మీసమయంబున చూచెద నట్టులె ॥భా॥

వ॥ నాథా నాపై ప్రేమగలిగి కొనితెచ్చిన పదార్థంబేమో చూడ గోరితిని సెలవొసంగుము.

కు-వ॥ సఖీ అటులే చూచి గైకొనుము. (అనిన పద్మగంధి

క-వ॥ హా ప్రాణేశ్వరా హా ప్రాణేశ్వరా యిదియే మా యైశ్వర్యము యీలా పెట్టియే యంతేవడో మనుష్యుడు గలడు వాని జూచినంతలో నాకు భయంబగు చుండెను రక్షింపుము రక్షింపుము.

ప-వ॥ సఖీ భయపడకుము మదనప్రభువగు భానురాజుగారి పుత్రుండగు మదన విజయుడు వింటివా.

మ-వ॥ ఏమీ కుశాగ్రబుద్ధీ నేనా చంద్రరేఖ గృహంబునుండిం దెల్లు వచ్చితిని యిది నా కాశ్చర్యంబై తోచుచున్నది తెల్పుము.

కు-వ॥ విజయుం యీ వృత్తాంతమంతయు మీ జనకుని యెదుట విన్నవించెదను. అంతవరకు నోపియుండుము.

మ-వ॥ సరే అటులైన జనకుని జేరబోవుదము రమ్ము.

కు-వ॥ అటులే పోవుదము పదము. సఖీ నీవుకూడ మా వెంట రావలయును యచ్చట జరిగిన వింతలన్నియు నీ వాలింపవలయును మరియు నాకేమైన అపాయము సంభవించిన నీ హస్తస్పర్శ గావించిన నే జీవించగలను వింటివా.

ప-వ॥ నాథా మీరనునట్లుగానే మెదిలెదను. (నిష్క్రమింం)

భా - కు శా - వాదం - దరు.

కు॥ భూమియాశ మీ నయుడూ । యేతెంచినాడు ॥భూ॥ క్షేమమునను యిల జీవించియుతా । ధీమంతితో నిను జేరెను నేడును ॥భూ॥
వ॥ రాజేంద్రా నీతనయుడు జీవించి నిన్ను జేరవచ్చెనుయిదో చూడుడు.

భా॥ సంతోషమాయె నిశా । యింతలో సుబుద్ధియిక ॥పం॥ మంత్ర బమునవిను । మరువజాలనూ । యెంతో పుణ్యుడవు యేమనందును ॥పం॥
వ॥ ఆహా సుబుద్ధీ నా పుత్రుని పునర్జీవితుని జేసి నాకొసంగితివి నీవంటి పుణ్యపురుషుం డీ లోకంబున లేడుగదా.

కు॥ నన్నేలా పెంపుజేసెరయా । విన్నర తెల్పెదనే ॥న॥ సన్నుతాంగి పద్మగంధి చేసీ । చిన్ని కుమారుడు జీవించెను విను ॥న॥
వ॥ రాజేంద్రా నన్నేల పెంపు జేసెదరు మీకుమారుండీ పద్మగంధివల్ల జీవించెను వింటిరా.

భా॥ యిటులేలా బలె - రా । కుటిలంబు వలదిక ॥యి॥ పటుబలా ధ్యానాపై కృప గలిగియు । యిటువచించుమా యిప్పుడు నిజంబుగ ॥యి॥
వ॥ సుబుద్ధీ అట్లనక నాయందు కృపగలవాడవై యాసవిస్తారంబెల్ల

తు॥ ధరకాంతా శర్మణి గానునీ ; దలచియు నావదెనీ శిధ॥ సరగు
గా యీసఫలోపల నే । జారి తెల్పెద మనమంచి వినుడితా ॥ధ॥

వ. హా జేందా! అటులే తెల్పెదను స్థిరచిత్తులై వినుడు.

సీ॥ వినుము తెల్పెదనీకు తనయునిపై కొపా ♦ వశముచేతను
కృవల్లియావుకు ♦ రతికేళికారకయ్యె బ్రీతిమాలినను చాల ♦ హితవ్రలు
వ్వెనీ సుతుడు అవ్వుక ♦ వినకున్న కోపించి వెడలించినను తన ♦
నములో కపటంబు నరిదలంచి ♦ జనకుని జేరియు ఘనముగా దుఃఖించు
చు దెల్పెనూ రాజసుతుడు నన్ను ॥ భంగపుచ్చనటన్న యాసంగ తెరిగి
సురుడు నిన్ను జేరియు బుద్ధిలేక ♦ కన్నియయు బల్కు రీతి తా విన్న
చి ♦ నిన్ను సుతుని ఖంచుమనె నిజముగాను ॥

వ॥ అట్లు భూసురుడు నీతో విన్నవించగా తలవరులకు నీవునీ సు
ని వప్పగించితివి. వారిని మెప్పించి మేమిరువురము యొరులకు తేట
బుండ యింద్రపురంబు జేరి ఆచ్చోట నొక దేవాలయంబున స్వామిని
సేవింపబోగా అందొక చిత్రపటంబున నిరువురు కన్యలు లిఖింప బడి
యుండుట జూచి, నీకుమారుండు మోహంబుచే మూర్ఛిల్లెను. నేనతని
శాంతిప జేసి యాకన్యలదెచ్చి నీకొసంగెదనని యభయంబిచ్చి, నతని
చ్చోటనే యుంచి యాకన్యలకొరకె నొక్క శ్రీమలం జెంది, శంకరుని
ంబుగొని వారిని గొనివచ్చి, నీసుతున కొప్పగించితిని. జ్యేష్ఠురాలిని
చేకొని చిన్నకన్యను నాకొసంగెను. మేమిరువురము సంతోషంబున
రంబునకు వచ్చుచుండ, యీ విజయుండు డస్సి నొక వృక్షంబుక్రింద
పండియుండెను. అంత నావృక్షంబుపై రెండు పక్షులు యీరాకుమా
రకు మూడుగండంబులుండెనని తెలిపెను యాగండముల యుపశాంతి
ండ దెలిపినవి. ఆపలుకులు నేవిని యా మూడుగండముల దప్పించి
ని. నాల్గవగండము తనభార్యచే మరణించునని పలికి యుండెను అది
ండ నేవినియుంటిని. ఆపలుకులు యెవరేని విని వరుసకు విన్న వించిన
నిశిరస్సు శకలీభూతమగునని పలికి ఆపక్షులు యెగసిపోయెను. యిది నే
పెట్టుచుండగా, యీవిజయుని భార్య మన వూరి వెలుపల నున్న బ్రా
రాముని తో కలిసి నీసుతుని శిరంబు ఖండించెను. అప్పుడు నేను
దు రేఖను బెదరింపబోగా యీనేరము నాపై మోపబడెను. నేనిన్ను
ంతింపజేసి, నీకుమారుని శవమును గైకొని నాభార్యయైన పద్మగంధి

యోదేవి యీయాపద్వ్యగ్రఃదికి మత్యుర్యంజెందిన మనుష్యుడు నీహస్త స్పర్శచె పునర్జీవితు డగునని వరమిచ్చెను నేఁడదివిని యీయాపేచే నా పెట్టెయందు నీకొరకు దెచ్చిన పదార్థంబున్నదని చెప్ప. నీమెహస్త స్పర్శచే నీకుమా రుండు మరల జీవముల పొందెను వింటిరా. (అనినంతలో కుశాగ్రబుద్ధి తలవగిలి భూమిపైమూర్ఛిల్లెను.)

భా వ॥ ఆహా యిదియేమి మాశ్చర్యము యీ వింతలు దెలిపిన తోడనే కుశాగ్రబుద్ధి తలవగిలి చచ్చెను. హాదైవమా రక్షింపుము రక్షింపుము.

కు-వ॥ ప్రాణేశ్వరా ప్రాణేశ్వరా (అని తన హస్తము మోపి నంతలో కుశాగ్రబుద్ధి లేచును)

వ॥ అనంతరం మా కుశాగ్రబుద్ధి యాజ్ఞానుసారముగ కనకల్లిన చంద్రరేఖలకు భానురాజు ప్రాణాంత శిక్షవిధించి యెల్లరు సుఖంబున నుండిరంత.

అందరి - దరువు.

ఆనందమూ మనవారికెల్ల బహు శానందమూ । యీ నాడుకుశ దర్పణీశూని కరుణాచె ॥ఆ॥

మంగళహారతి

మంగళములూ మహేశా । మమ్మేలుకో గిరీశా ॥మం॥ గంగా ధర కృత్తివాసా । లింగా శ్రీ నాగభూషా ॥ మం ॥ నందీవాహా యిటు రావా । నందానుడను నను బ్రోవా ॥ నం ॥ యిందారు దెంచుదేవా । యిపుడూను నన్ను ... ॥మం॥ కోరిన వారికి నీవూ । కోటికలోసంగి నావూ ॥... పరమేశ్వరా ... డావూ పరికించి చూడనీవూ ॥మం॥ నిన్నును ... వారి । ... భవములు దూరి ॥ని॥ మన్నవి చింతలు ... యున్నావి గదావురక్షే ॥మం॥ ధరకూశ దర్పణి వాసా । దొర ... ॥ధ॥ కరుణ ... దీనపా ... ధీశా ॥మం॥




మదన విజయ నాటకము సంపూర్ణము.